# శ్రీ కుమార

# నాగదేవతా సర్వస్వము



రచయిత :

శ్రీ శ్రీ శ్రీ త్రిపురానందనాథుల శిష్యుడు

నిష్ఠల సుబ్రహ్మణ్యం

పొన్నూరు

ప్రకాశకులు

సర్దార్ బూసా కోటయ్య

పొన్నూరు

పూజ్య జననీ జనకులైన



శ్రీబూసా కోటినాగయ్య ధర్మపత్ని శ్రీమతి రాచమ్మగార్ల
జ్ఞాపకార్థం కుమారుడు శ్రీ బూసా కోటయ్య, శ్రీమతి పిచ్చమ్మ
దంపతులు ప్రచురించినది.

# ముద్రణదాత తల్లిదండ్రులు

ముద్రణదాత తల్లిదండ్రులు : శ్రీమతి రాచమ్మ, శ్రీ బూసా కోటి నాగయ్యగార్లు (వీరి జ్ఞాపకార్థం ముద్రితము) వీరు గుంటూరు జిల్లా, నరసరావుపేట తాలూకాలోని లింగంగుంట్ల అగ్రహారంలో నివసించేవారు. లింగాయతులు. వీరు ప్రతిదినము మూడు సంధ్యాకాలముకాలములోను శివపూజ చేసేవారు. శివపూజ చేయకుండా భోజనం చేసేవారుకాదు. ఆచార పరులు. బాధ్యతలు గుర్తెఱిగినవారు. లౌకికజీవనంలో కిరాణాకొట్టు వ్యాపారం చేసేవారు. వీరికి ఐదుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు.

**కుమారులు**

1) శ్రీ వీరయ్య
2) శ్రీ వీరభద్రయ్య
3) శ్రీ నాగేశ్వరరావు
4) శ్రీ కోటివీరనాగయ్య
5) శ్రీ కోటయ్య

**కుమార్తెలు**

1) శ్రీమతి కోటినాగమ్మ
2) శ్రీమతి బసవనాగమ్మ
3) శ్రీమతి నాగమ్మ

# ప్రకాశకులు

## శ్రీ బూసా కోటయ్యగారు

శ్రీబూసా కోటినాగయ్యగారి 5వ కుమారులైన శ్రీబూసా కోటయ్యగారు ది. 6-6-1938న నర్సరావుపేట తాలూకా లింగంగుంట్ల అగ్రహారములో జన్మించిరి. నాగేంద్రస్వామిపై వీరికి బాల్యమునుండి దైవ భక్తి ఎక్కువ వీరు 19 ఏళ్ళ వరకు నాగేంద్రస్వామిని కడుదీక్షతోధ్యానించి. ఉదర పోషణార్థం లౌకికజీవనమునకు నాందిపలికి 1957లో శ్రీమతి పిచ్చమ్మగారిని వివాహము చేసికొని 1958 నుండి 1966వరకు శ్రీ గ్రంధి సుబ్బారావుగారి క్రేన్ ఒక్కపొడి కంపెనీలో సేల్స్‌మేన్‌గా 1966 ఏప్రిల్ నుండి ఏజంటు గాను పనిచేయుచున్నారు.

వీరు 1979 నుండి కిరాణామర్చంట్స్ అసోసియేషన్ ప్రెసిడెంటుగా చేస్తూ, గుంటూరు జిల్లా అసోషియేషన్‌కు కన్వీనర్‌గాను, 1981లో జిల్లా

ప్రెసిడెంటుగా జిల్లాలో కొన్ని కిరాణామర్చంట్స్ అసోసియేషన్స్‌ను స్థాపించుట, 1982లో 'ఆహారకల్తీ నిరోధక చట్టం' అను ఇంగ్లీషు పుస్తకాన్ని తెనుగులోకి అనువాదముచేయించి ముద్రించి వర్తకులకందించి వారిని చైతన్యవంతులను చేసిరి.

1979 నుండి 1988 వరకు ఆంధ్రప్రదేశ్ క్రేన్ఒక్కపొడి ఏజెంట్ల అసోసియేషన్ సెక్రటరీగా పనిచేసిరి 1993 నుండి అధ్యక్షులుగా ఉన్నారు.

వీరు 1982 నుండి బ్రహ్మశ్రీ జగన్నాథస్వామిఆశ్రమ సేవాసమితి (పొన్నూరు) కి కార్యదర్శిగా పనిచేయుచున్నారు.

1984 నుండి 1987 వరకు సహస్రలింగేశ్వరస్వామి దేవస్థానం మేనేజింగ్ ట్రస్టీగా పనిచేసిరి.

కోటప్పకొండలోనున్న శ్రీ వీరశైవలింగాయతి గణార్చనసంఘ (అన్నదానసత్రం) మునకు అధ్యక్షులుగా వున్నారు.

ఆంధ్ర వీరశైవమహాసభ సభ్యులుగా ఉన్నారు.

వీరు అధ్యక్షులుగా 1984లో కోటిబిల్వార్చన కోటికుంకుమార్చన, శివపార్వతులకు సప్తసప్తాహాలు, నిత్యాన్నదానం 100 రోజులు నిర్వహించిరి.

వీరు పైధార్మిక కార్యక్రమాలేకాక దైవభక్తి పెంపొందే ఈ పుస్తకాలను ముద్రించారు. (1) మన కోటప్ప (2) శ్రీ వీరభద్రవిజయము (3) వృషభరాజ సందేశం.

వీరికి ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. పెద్దకుమారుడు చి॥ శివనాగేంద్రవరప్రసాద్ B.Com., కోడలు చి॥ ల॥ సౌ॥ వీరమణి మనుమలు : చి॥ నాగమహేశ్ (2) చి॥ శివనాగేశ్. 2వ కుమారుడు : చి॥ శివశ్రీనివాసరావు B.Tech., 3వ కుమారుడు : శివనాగబాబు B.Tech.,

.వ కుమార్తె శ్రీమతి నాగమల్లీశ్వ రి భర్త శ్రీ నేలపల్లి వీరభద్రయ్య

మనుమలు : 1) చి॥ బసవనాగరాజు

2) చి॥ బసవవెంకటనాగార్జునప్రసాద్

3) చి॥ బసవనాగశ్రీనివాసరావు

మనుమరాలు : చి॥ బసవనాగసునీతాదేవి

రెండవ కుమార్తె :శ్రీమతి కోటివీరనాగమ్మ, భర్త శ్రీ చక్రవాది బాలకోటేశ్వర రావు, M.Com.

మనుమలు ; 1) చి॥ నాగేశ్వరరావు

2) చి॥ వీరేంద్రనాథ్

మనుమరాలు : చి॥ వీరనాగవనిత

మూడవకుమార్తె : శ్రీమతి నగరాజకుమారి భర్త శ్రీ దేవిశెట్టి చరణబసప్ప

మనుమలు : 1) చి॥ సందీప్

మనుమరాలు : చి॥ శ్వేత

మొదటినుండి ఆధ్యాత్మిక జీవనాన్నిసాగించే శ్రీ బూసా కోటయ్యగారు శివభక్తిపరులు. బాల్యంనుండి శ్రీ నాగేంద్రస్వామివారిపై వీరికి అపారమైన భక్తి. వ్యయప్రయాసలకోర్చి ఇలాంటి గ్రంథాన్ని వెలుగులోకిదెచ్చిన సహృదయులు. వారిని ఆ నాగేంద్రస్వామి ఎల్లప్పుడు కాపాడాలని కోరుచున్నాను

బూసవంశాబ్ధిముక్తా విభూషణంబు
నాగరాజపదాంబు జానందితుండు
దిశలనిండించె క్షీరసందిగ్ధకీర్తి
కోటయాఖ్యుండు రాసమకూర్మిబిడ్డ

# తొలిపలుకు

ప్రియపాఠకులారా!

ప్రపంచావిర్భావ హిమశైలంనుండి సంప్రదాయరహస్య రత్నాలలో ఆర్షవాఙ్మయ భాగీరథీస్రవన్తి అవిచ్ఛిన్నంగా ప్రవహిస్తూ జీవనదాయినియై అమందానందాన్నిస్తూంది. అందులో రహస్యాలను యధామతి సంప్రదాయ జిజ్ఞాసువులకందించే కార్యక్రమంలోభాగంగా ప్రస్తుతం శ్రీ నాగేంద్రస్వామి-కుమారస్వామి - సుబ్రహ్మణ్యేశ్వరుల విషయాలతో "శ్రీ కుమారనాగదేవతా సర్వస్వము" అనే గ్రంథం వెలువడుతూంది. ఈ ముగ్గురు దేవతలు ఒకే దేవుని రూపాంతరములే. స్వామి షణ్ముఖుడు గనుక గ్రంథంగూడ ఆఱు అధ్యాయాలతో విభక్తమైంది. శ్రీశంకరాచార్యులవారి కనకధారాస్తవ ప్రేరితుడనై శ్రీవల్లీదేవిపై "స్వర్ణధారాస్తుతి"ని రచించడం జరిగింది.

నాగేంద్రభక్తులైన శ్రీ [illegible]సా కోటయ్యగారు నాగేంద్రునిపై గ్రంథాన్ని రచించమని నన్ను కోరడం, మాయిలవేల్పు ఆదైవమేకావడం దైవఘటన. మాయింట్లో అందరిపేర్లలోనూ సుబ్రహ్మణ్య - కుమారనామాలు కలుస్తాయి. నాగేంద్రోపాసనానుగ్రహం వలన ఈ గ్రంథాన్ని యథాశక్తిగా పూర్తి చేయడం జరిగింది. ఆస్వామి యనుగ్రహవీక్షణాలను ప్రసరింపజేయాలని కోరిక. గ్రంథాన్ని ఉపయోగించుకోవడం భక్తులవంతుకాగా గ్రంథసార్థకత విషయాలను పరిశీలికచడం సహృదయ పండితులవంతు.

నాగేంద్రస్వామిపై రచింపబడిన ఈ గ్రంథాన్ని నాగేంద్రహారుడైన శ్రీ త్రిపురాంతకేశ్వరునికే సమర్పిస్తున్నాను. ఆ త్రిపురాంతకేశ్వరుని యిలా స్తుతిస్తున్నాను.

1) పార్శ్వేసముత్తేక్షుధితాత్పయోధేః
సర్వేషు దేవేషు వినిశ్చలేషు
ఆర్తావనాయ గ్రసతిస్మయస్తమ్
పాయాదపాయాత్త్రిపురాంతకేశః

2) సహస్రధారే నభసః ప్రవాహే గాంగే జగత్సర్వమిహాలిహానే
జటాసు యో బిందుమివాబబంధ పాయాదపాయాత్త్రిపురాన్తకేశః

3) యస్సూర్యచన్ద్రాగ్ని్యరథాంగవాహీ గర్జన్ పునశ్శంఖగళేనశత్రుమ్
పురాపురారిం హతవాన్ హరీషః నాస్తిక్రియా యస్య రిపుఘ్నదృశ్యే
పాయాదపాయాత్త్రి పురాన్తకేశః

4) తాపం నరాణాంకుసుమైర్విధాతుః నేత్రాగ్నినా తాపమచీక్లుపద్యః
శివాకృపావీక్షణ చన్ద్రికాభిః సిక్తస్సుమేఘం పునరభ్యగచ్ఛత్।
పాయాదపాయాత్త్రి పురాన్తకేశః

5) ఆస్తేశివోయత్ర మహీశివాస్యాత్ అన్యాపరేతప్రియమావహన్తి
ప్రజాపతిస్స్యాదశివం ను కర్తా? పాయాదపాయాత్త్రి పురాన్తకేశః

6) భక్తం సుధాంశుం శిరసోద్వవాహ తన్వర్ధదానేన శివాం దధార
సర్వాత్మనా మాముపలాలయిష్యన్ పాయాదపాయాత్త్రి పురాన్తకేశః

7) గుణత్రయం జ్ఞానశరేణభిన్దన్ పురత్రయం రక్షతు మాంత్రికాలే
త్రయీవపుః త్ర్యంబక ఆత్మతేజాః పాయాదపాయాత్త్రి పురాన్తకేశః

8) సముద్రపానేన హి యస్య శిష్యః రరక్ష సంజీవనతః కవీశః
మాయాం నియమ్యాశు కృపార్ద్రదీనమ్ పాయాదపాయాత్త్రి
పురాన్తకేశః

9) రౌద్రం మఖం త్రైపురమావహన్ సః గురూత్తమస్తాన్త్రిక చక్రవర్తీ
క్షేత్రేమనోజ్ఞే త్రిపురాన్తకేశ నుతిం విధాతుం సమచోదయన్మామ్

ఈ గ్రంథాన్ని భక్తిప్రపత్తులతో వెలుగులోనికి తెచ్చిన శ్రీ బూసా కోటయ్యగారికి ఆ నాగేంద్రస్వామి అభిలాషితార్థమును ఒసంగవలెనని సర్వేశ్వరుని కోరుచున్నాను. సకాలంలో అందముగా ముద్రించిన శ్రీ లక్ష్మీ గణపతి ప్రింటర్స్ అధినేత శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, ఆకర్షణీయంగా ముఖచిత్రాన్ని చిత్రించిన మిత్రులు శ్రీ వెల్లటూరి పూర్ణానందశర్మగారికి, సహకరించిన సహృదయులకు కృతజ్ఞతలతో.

మీ
నిష్ఠల సుబ్రహ్మణ్యం

1) సుష్ఠుగ వాఙ్మయపీఠా
ధిష్ఠితుడై కావ్యతత్త్వధీనిధియగు మా
నిష్ఠల సుబ్రహ్మణ్యని
నిష్ఠురకరవాలధార నీతిని నిలుపున్

2) నవభారత కవనమ్మిది
జవజీవములతిశయింప జాతిని నడుపన్
కవితా శారదయగుచును
యువతకు ప్రగతికివలసిన యోచన లొసగెన్.

—"ఉపన్యాసకళానిధి" "సాహితీబృహస్పతి"
**మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి**
లెక్చరర్, జిల్లెళ్ళమూడి



రచయిత :

శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యంగారు

# శ్రీ కుమారనాగదేవతా సర్వస్వము



## ప్రథమాధ్యాయము

# కుమారాననము

## శ్రీ కార్తికేయుని యుత్పత్తి

మొట్టమొదట శ్రీమన్నారాయణుడు శేషశయనుడై యుండేవాడు. అతని నాభికమలంనుండి బ్రహ్మ జన్మించాడు బ్రహ్మనుండి మరీచి మొదలగు వారు జన్మించారు. అది మొదలుకొని దేవతలు, రాక్షసులు, గంధర్వులు, మనుష్యులు, పక్షులు, పశువులు అన్నిప్రాణులు ఉద్భవించాయి. ఇలా సృష్టి పెరిగిన తరువాత బలవంతులైన దేవతలు, రాక్షసులు పరస్పరం ఒకరి నొకరు జయించాలని యుద్ధం చేయసాగారు. రాక్షసులలో బలవంతులు యుద్ధకండూతి గలవారు అనేకులు ఉండేవారు. హిరణ్యాక్షుడు, హిరణ్య కశిపుడు, విప్రచిత్తి, భీమాక్షుడు, క్రౌంచుడు రాక్షసులలో ముఖ్యులు. దేవసైన్యంలోని దేవత లందరినీ వీరు ప్రతిరోజు పదునైనబాణాలతో జయిస్తూ ఉండేవారు. వారి ఓటమిని చూచి బృహస్పతి వారితో యిలా అన్నాడు.

"దేవతలారా! సేనాధిపతి లేనిదే మనం జయం పొందడం సాధ్యం కాదు. మనసైన్యం అంతా రక్షించడం ఒక్క ఇంద్రునికి సాధ్యం కాదు. కనుక త్వరగా మఱియొక సేనాధిపతిని వెదకండి."

తరువాత వారంతా బ్రహ్మలోకానికి వెళ్లి సేనాధిపతిని ప్రసాదించమని బ్రహ్మను అడిగారు. వీరికి నేనేం చెయ్యాలా? అని బ్రహ్మ ఆలోచిస్తూ

ఉండగా అతనికి రుద్రుడు గుర్తుకువచ్చాడు. దేవతలు గంధర్వులు, ఋషులు, సిద్ధులు, చారణులు, బ్రహ్మను ముందుంచుకొని కైలాసపర్వతం చేరి పశుపతి, మహాదేవుడు అయిన శివుడిని అనేకవిధాలుగా స్తోత్రం చేసారు.

## శివ స్తోత్రము



"మూడుకన్నులు గల వాడిని, భూతభావనుడవు అయిని ఓమహేశ్వరా! నిన్ను మేము శరణు వేడుతున్నాము. ఉమాపతీ! విశ్వపతీ! మరుత్పతీ! జగత్పతీ! శంకర! మమ్మల్ని స్వయంగా నువ్వే రక్షించు. నీజటాకలాపంలో చంద్రుడు న్నాడు. అతని కాంతి మూడులోకాలనూ వ్యాపిస్తూంది. త్రిశూలపాణీ! పురుషోత్తమా! అచ్యుతా! మాకొచ్చిన దైత్యుల బాధనుండి మమ్మల్ని కాపాడు. నీవు బ్రహ్మవి విష్ణుడవు. రుద్రుడవు. ఓపార్వతీపతీ! కైలాసప్రియా! నీవు దేవతలందరిచే పూజింపబడుతున్నావు. నీవే వినాయకుడివి. బ్రహ్మ ఇచ్చిన రాక్షసుల వరాలను అంతంచేసేవాడివి నీవే. భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశములలో నీవే నిండియున్నావు. ఆకాశంలో నీవు శబ్దరూపంలో ఉన్నావు. గాలిలో రెండు, అగ్నితో మూడు, నీటిలో నాలుగు, భూమిలో ఐదుగుణాలతోటి నీవు ప్రకాశిస్తున్నావు. చెట్లు, రాళ్లతో అగ్నిశరీరంతో సత్యస్వరూపుడవై యున్నావు. నువ్వులలో తైలం నీవే. రాక్షసులచే బాధింపబడే మమ్మల్ని నీవే రక్షించు.

త్రిలోచనా! సూర్యుడు, ఇంద్రుడు, చంద్రుడు మొదలైన వా రెవరూ లేని సృష్టికి ముందు కూడ నీవే ఉన్నావు. ఈ విషయంలో ఎలాంటి సందేహము లేదు. దక్షుడు నిన్ను బాధించినట్లే మమ్మల్ని రాక్షసులు బాధిస్తున్నారు. కపాలమాలీ! చంద్రశేఖరా! స్మశానవాసీ! తెల్లని భస్మమును సర్పాన్ని ధరించినవాడా! యముడిని జయించినవాడా! మమ్మల్ని కాపాడు. నీవు పరమపురుషుడివి. పార్వతి శక్తి. త్రిశూలరూపంలో యజ్ఞాగ్నులున్నాయి. నీజటల రూపంలో సముద్రాలు, పర్వతాలు, నదులు ఉన్నాయి. శరీరాన్నే

అజ్ఞానులు చూస్తారు తప్ప జ్ఞానరూపుడవైన నిన్ను ఎవరూ గుర్తించలేరు. యుగాలలో ఒకేకాలం, అగ్నులలో ఒకే అగ్ని ఉన్నట్లు నీవే బ్రహ్మ, విష్ణువు, రుద్రులుగా ఉన్నావు. దేవతలతో పెద్దలందరూ నీవు యితరులకు సంతోషాన్ని యిస్తావని భావిస్తున్నారు. ఓ విశ్వేశ్వరా! నీకు నమస్కారం. మమ్మల్ని కాపాడు."

ఇలా దేవతలు స్తుతించాక మీకేంకావాలో వెంటనే చెప్పండి అన్నాడు శంకరుడు. రాక్షసులను జయించడానికి సేనాధిపతిని సృష్టించు బ్రహ్మ మొదలైన దేవతలందరికీ ఇదే మేలును కలిగిస్తుంది. అన్నారు దేవతలు.

"ఓ దేవతలారా! మీకు సేనాధిపతినియిస్తాను. మీరంతా ధైర్యంగా ఉండండి." అన్నాడు శంకరుడు. దేవతలను పంపించి శంకరుడు తన శరీరంలో ఉన్న శక్తిని సంతానంకోసం సంక్షోభింపజేసాడు. వెంటనే జ్ఞాన శక్తితో అగ్నిలా సూర్యుడిలా ప్రకాశిస్తూ కుమారస్వామి జన్మించాడు.

ఈ కుమారస్వామి జన్మగురించి అనేక కథలున్నాయి. ఈతడు మన్వంతరాలలోకూడ దేవసేనాపతి అయ్యాడు. ఇలా కుమారస్వామి జన్మించాక బ్రహ్మదేవతలందరితో కలిసి శివుడిని, కుమారస్వామిని పూజించాడు. దేవతలచే, ఋషులచే పూజింపబడిన కుమారస్వామి నాకు సహాయంగా ఆడుకునే వస్తువులనివ్వమని దేవతలనడిగాడు.

అప్పుడు శంకరుడు, "పుత్రా! నీకు ఆడుకొనడానికి కుక్కుటాన్ని (కోడిని) యిస్తున్నాను. శాఖుడు, విశాఖుడు అనేవారిని నీకు సహాయంగా యిస్తున్నాను. కుమారా! భూతాలకు అధిపతిగా, దేవసేనకు అధిపతిగా నీవు ఈనాటినుండి ఉండు."

తరువాత దేవతలు, ఓ శంకరసుతా! నీవు మాకు సేనాపతివి కావాలి. షణ్ముఖా! స్కందా! విశ్వేశా! కుక్కుటధ్వజా! పావకీ! కుమారా! నీవు శత్రువు లను భయపెట్టగలవు. బాలగ్రహాలకు నీవే అధిపతివి. క్రౌంచపర్వతాన్ని భేదించావు. కృత్తికలు నీ తల్లులు. ఓ శివసుతా! నీకు నమస్కారము." అని స్తుతించారు.

అప్పుడు కుమారస్వామి పన్నెండు సూర్యులతో సమానంగా ప్రకాశించాడు. గొప్ప శౌర్యంతో ప్రకాశించాడు. తన తేజస్సుతో మూడు లోకాలను ప్రకాశింపజేసాడు.

## కుమారస్వామి అగ్నికి, కృత్తికలకు పుత్రుడైన విధము

ఆదిమన్వంతరంలో కృత్తికాదేవతలు, పార్వతి యితని తల్లులు. కాగా, ఒకప్పుడు దక్షయజ్ఞసమయంలో దక్షునిచే అవమానింపబడిన దాక్షాయణి యోగాగ్నికి తన శరీరాన్ని అహుతిచ్చింది. తరువాత ఆమె హిమవంతునికి కుమార్తెగా జన్మించింది. ఆమె శివునికొఱకు తీవ్రమైన తపస్సుచేసి శంకరుడిని మెప్పించింది. తరువాత సప్తమాతల దేవతల సమక్షంలో వైభవంగా వివాహం జరిగింది. వారు ఒకప్పుడు వనంలో క్రీడిస్తూండగా శంకరుని దివ్యశక్తి (గొప్పతేజస్సు) రావడానికి దేవతలు వారి ఆనందానికి విఘ్నం కలిగించారు. ఆతేజస్సు ఏమైందని శివపార్వతులు దేవతలనడిగారు. బ్రహ్మ, యముడు, ఇంద్రుడు, వరుణుడు, కుబేరుడు, ఈశానుడు, రుద్రులు, మన్మథుడు, అశ్వనీదేవతలు, ఇతరదేవతలు, దేవతలభార్యలు, తమకు తెలియదని, దాని నపహరించినవారు అనేక కష్టాలపాలై పాపులవుతారని చెప్పారు.

అప్పుడు విష్ణువు మఱల ప్రశ్నించగా ధర్ముడు లేచి శంకరుని నుండి వెడలిన తేజస్సు భూమిమీద పడిందని తెలిపాడు. అప్పుడు ఆతేజస్సును తాను భరింపలేక అగ్నిలోవేసానని తెలిపింది. దానికి, అగ్ని తాను ఆశక్తిని తట్టుకోలేగ జెల్లుతోటలో పడవేసానని తెలిపాడు. వెంటనే వాయుదేవుడు లేచి జెల్లుతోటలోపడిన ఆ తేజస్సు అందమైన బాలుడిగా మారిందని ఆ తోట స్వర్ణరేఖ అనే నదీతీరంలోఉందని తెలిపాడు.

ఆమాటకు చంద్రుడు కలగజేసుకొని, బదరికాశ్రమంనుండి వెళ్తున్న కృత్తికలు తమయింటికి తీసుకొనివెళ్లాయని తెలుపగా స్తన్యంయిచ్చి కృత్తికలు ఆబాలుని పెంచాయని జలదేవత తెలిపింది. అప్పుడు అక్కడేఉన్న సంధ్యా దేవతలు, "ఆఱుగురు కృత్తికాదేవతలు ఆబాలుని పెంచాయని అతనికి కార్తికేయుడని పేరుపెట్టార"ని తెలిపారు. కృత్తికలు ఒక్కక్షణం కూడ ఆచిన్నవానిని విడచియుండలేదు. మూడులోకాలలోను అరుదైన, రుచికరమైన వస్తువులతో ఆబాలుని పెంచాయి కృత్తికలు.

బాలుని పరిస్థితి తెలుసుకున్న విష్ణువు, పార్వతి ఎంతో సంతోషించారు. పుత్రుని జాడ తెలిసినందుకు సంతోషించిన పార్వతి రత్నాలను దానం చేసింది, లక్ష్మి, సావిత్రి, మేన, సరస్వతి మొ॥ దేవతలు ఎన్నోవస్తువులను బహూకరించారు.

పుత్రుని జాడ తెలిసిన శంకరుడు, వీరభద్రుడు, విశాలాక్షుడు, శంకుకర్ణుడు, కబింధకుడు, నందీశ్వరుడు, మహాకాలుడు, వజ్రదంతుడు, భగందరుడు, గోధాముఖుడు, దధిముఖుడు, ఇంకా లక్షమంది క్షేత్రపాలకులను, మూడులక్షలభూతాలను, నాలుగులక్షల భేతాళలను, ఐదులక్షల యక్షులను, నాలుగులక్షలకూష్మాండదేవతలను, మూడులక్షలబ్రహ్మరాక్షలను, నాలుగులక్షల డాకినీలను, మూడులక్షల యోగినులను, రుద్రులను, భైరవులను బాలుడిని వెదకడానికి పంపించాడు. వారంతా కృత్తికాదేవతల భవనాన్ని చుట్టుముట్టారు. ఇది గమనించిన కృత్తికాదేవతలు భయపడగా కుమారస్వామి వారి భయం పోగొట్టాడు. నందీశ్వరుడు కుమారస్వామికి విషయంచెప్పి, కైలాసానికివస్తే విష్ణువు పట్టాభిషేకం చేస్తాడని, తల్లిదండ్రులైన శివపార్వతులు సంతోషిస్తారని తెలిసి పిలిచాడు. అందుకు కుమారస్వామి సమ్మతించి కృత్తికాదేవతల అనుజ్ఞతో కైలాసానికి నందీశ్వరునితో కలసి బయలుదేరాడు.

ఇంతలో విశ్వకర్మ నిర్మించిన రథం సిద్ధమైంది. దాన్ని పార్వతి పంపింది. అది వజ్రాలతో చేయబడింది. పారిజాతపుష్పమాలలతో అలంకరించబడింది. ఆ రథానికి నూఱు చక్రాలున్నాయి. కుమారస్వామి ఆ రథాన్ని ఎక్కాడు. కృత్తికాదేవతలు పుత్రవియోగం భరించలేక విచారించారు. కుమారస్వామి ఆధ్యాత్మికవచనాలతో వారిని ఓదార్చి బయలుదేరాడు. కైలాసానికి వెళ్లి క్షణకాలం ఒక మఱ్ఱిచెట్టునీడలో పరివారంతో విశ్రమించాడు.

అప్పుడు పార్వతి మంగళవస్తువులతోటి, దేవతలతోటి ఎదురువెళ్లి కుమారస్వామిని తీసుకువచ్చింది. కుమారస్వామి విష్ణువుకు, దేవతలకు నమస్కరించాడు. విష్ణుమూర్తి కుమారస్వామిని రత్నసింహాసనంపై కూర్చోబెట్టి వేదమంత్రాలతో అభిషేకంచేసి పట్టంగట్టాడు.

తరువాత ఆబాలునికి క్షీరసముద్రంనుండి పుట్టిన వస్త్రాలను కౌస్తుభమణిని. వనమాలను, చక్రాయుధాన్ని విష్ణువు బహూకరించాడు. బ్రహ్మ యజ్ఞోపవీతాన్ని, వేదాలు గాయత్రిని, సంధ్యాకృష్ణమంత్రాలను, కమండలాన్ని, బ్రహ్మాస్త్రాన్ని, ధర్ముడు దయను, ధర్మబుద్ధిని, యోగశక్తులను, బ్రహ్మజ్ఞానాన్ని, శూలము, ధనుస్సు, గొడ్డలి, శక్తి, సంహారాస్త్రాలను శివుడు బహూకరించాడు. వరుణుడు తెల్లని గొడుగును, రత్నాలదండను యిచ్చాడు. చంద్రుడు ఏనుగును, గుఱ్ఱాన్ని, అమృతకుంభాన్ని యిచ్చాడు. సూర్యుడు

రథాన్ని, యముడు యమదండాన్ని, అగ్ని శక్తిని, దేవతలు యితర ఆయుధాలని యిచ్చారు. మన్మథుడు కామశాస్త్రాన్ని, సముద్రుడు రత్ననూపురాలను, పార్వతి మహావిద్యలను, బుద్ధి, దయ, శాంతి, సంతోషము, ఓర్పు, ధైర్యము విష్ణుభక్తిని యిచ్చింది.

ప్రజాపతి దేవసేన అనే అమ్మాయిని ప్రసాదించి వివాహం చేసాడు. మునులు, దేవతలు అంతా కుమారస్వామిని ప్రశంసించారు.

## దేవసేన ఎవరు?

దేవసేన కుమారస్వామి భార్య. ఈమెయే షష్టీదేవత. చిన్నపిల్లల్ని గ్రహ, భూతబాధలనుండి ఈమె రక్షింపగలదు. ఈమె యింద్రుని కుమార్తెగా అభివర్ణింపబడింది.

# కుమారస్వామి జననము

శివపార్వతులు క్రీడించుచుండగా తననుమించిన కుమారుడు జన్మిస్తాడనే భయంతో ఇంద్రుడు వారి క్రీడకు భంగంకలిగించాలని భావించి అగ్నిని పంపాడు. అగ్ని వారికెదురుగా రాగా పార్వతి భయపడి దూరంగా జరిగింది. అప్పుడు శంకరుని నుండి వచ్చిన తేజస్సు భూమిమీదకురాగా, తమకు భంగం కలిగించిన అగ్నియే దాన్ని ధరించాలని చెప్పింది. విధిహీక అగ్ని ఆతేజస్సును ధరించాడు. కొంతకాలానికి అగ్నిధరించలేక గంగకిచ్చాడు. గంగకూడ కొంతకాలానికి భరించలేక తెల్లుతోటలో ఉంచింది. ఆ తేజస్సు బాలుడిగామారగా ఆశిశువును కృత్తికలు పెంచాయి. ఇది స్థూలంగా బ్రహ్మాండ పురాణంలోని గాథ.

ఈతని పుట్టుకగూర్చి ఇంకొక విధంగాకూడ ఉంది. సప్తమునుల భార్యలను చూచిన అగ్నిదేవునికి మోహం కలిగింది. ఈ విషయం గ్రహించిన స్వాహాదేవి ఒక్క అరుంధతిరూపం తప్ప మిగిలిన ఆఱుగురు ఋషులభార్యల రూపంధరించి అగ్నిదేవుడిని సంతోషపెట్టింది. ఆ ఆరుగురి మునిపత్నుల వేషం ధరించిన స్వాహాదేవి నుండి కుమారస్వామి జన్మించాడు.

కుమారస్వామి పుట్టుకను వివరించేగాథలో విశేషం ఉంది. శివపార్వతులు ఆనందంగా విహరిస్తూ చాలాకాలం గడిపారు. దేవమానం ప్రకారం

వందసంవత్సరాలు గడిచాయి. అప్పుడు దేవతలందరు బ్రహ్మను ముందుంచుకుని శివుడిని 'నీతేజస్సును ఎవరూ ధరించలేరు. నీతేజస్సుతోనే తేజస్సును ధరించ'మని కోరారు. అందుకు శివుడంగీకరించాడు. అయితే తరువాత ఈ తేజస్సును ఎవరుధరిస్తారని అడుగగా భూమి ధరిస్తుందని చెప్పారు. శివుడు తన తేజస్సును భూమిపై యుంచాడు. కొండలు అడవులతోకూడిన భూమిఅంతా శివతేజస్సుతో నిండిపోయింది. అప్పుడు దేవతలు అగ్నినిపిలచి, "ఓఅగ్నీ! నీవు వాయువుతోకలసి ఈ తేజస్సును ఆవహించమ"ని కోరారు. అగ్నిఅలాగే వ్యాపించగా ఆ భూభాగమంతాకలసి శ్వేతపర్వతంగా మారింది. ఆకొండమీదనే అగ్నిలాగ, సూర్యునిలాగా ప్రకాశించే జెల్లుతోట ఏర్పడింది. అక్కడే కార్తికేయుడు జన్మించాడు.

అప్పుడు దేవతలందరూ శివపార్వతులను కుమారస్వామి జన్మించినందుకు సంతసిస్తూ ప్రశంసించారు. కాని సంతానంకోరికూడ శివుని సమాగమం పొందనందుకు పార్వతి ఎంతోబాధపడింది. కోపంతో "దేవతలారా! మీరు మీభార్యలయందు సంతానం పొందకుందురుగాక" అని వారిని శపించింది. "అనేకమందికి భార్యవుకమ్మ"ని భూదేవిని శపించింది. తరువాత దేవతలు వెళ్లాక శివుడు పార్వతితోకలసి హిమాలయంపై తిరిగి తపస్సు కొనసాగించాడు.

దేవతలందఱు బ్రహ్మను చేరి యిలా విన్నవించుకున్నారు. "మనకు సేనాధిపతిని ప్రసాదించాల్సిన దేవుడు పార్వతితో కలసి తపస్సులో మునిగిపోయాడు. ఇప్పుడు మనం ఏమిచేయాలి? "దేవతలు, అగ్నిని, గంగనుచేరి జెల్లుపొదలో పెరిగిన శివతేజస్సంభవుడైన బాలుడిని చేరుకున్నారు. ఆబాలునికి పాలివ్వడానికి దేవతలు కృత్తికలను కోరారు. కృత్తికలు తమ పుత్రునిగా భావించి ఆబాలుడిని పెంచారు. అందుకే ఆ బాలుడు కార్తికేయుడయ్యాడు. అతడు అజేయుడవుతాడని దేవతలు పలికారు. అప్పుడు కృత్తికలు కడుపుతీపితో ఆప్యాయంగా పుత్రప్రేమతో వారి గర్భంనుండి జన్మించినట్లు అతడిని గూర్చి భావించారు. అందువలన, శివునినుండి తేజస్సు జారినందువలన అతడు స్కందుడయ్యాడు. ఆఱుముఖాలతో కృత్తికలనుండి స్రవించిన పాలను త్రాగడంవలన షణ్ముఖుడు, షడాననుడు అని పిలువబడ్డాడు. ఒక్కరోజుమాత్రమే అలాపాలను త్రాగి, అం[illegible]ంచేతనే రాక్షసగణాలను

జయించాడు. అప్పుడు దేవతలందఱు అతనిని దేవసైన్యాలకు ప్రభువును చేసారు.

ఈ కుమారసంభవము ధన్యమైనది, పుణ్యమైనది. ఎవరు ఈ కార్తికేయునియందు భక్తిగలవారో వారు దీర్ఘాయుర్దాయం గలవారు, కుమారులు, మనుమలతో సుఖించి స్కందునివద్దకు చేరుకుని మోక్షం పొందుతారు.

బ్రహ్మాండపురాణంలో కూడ కొన్ని విశేషాలు ప్రతిపాదింపబడ్డాయి. కుమారస్వామి జన్మించినపుడు దేవలోకంలో దుందుభులు మ్రోగినాయి. సిద్ధులు చారణులు పువ్వులవర్షం కురిపించారు. గంధర్వులు పాటలు పాడారు. యక్షులు, విద్యాధరులు, సిద్ధులు, కిన్నరులు, సర్పాలు, (నాగదేవతలు) పక్షులు అతడిని చూడడానికి వచ్చారు. రాక్షసులు, కోతులు, అతని ప్రభావానికి తట్టుకోలేకపోయారు. సప్తర్షుల భార్యలతో అరుంధతితప్ప మిగిలిన మునిభార్యలు అభిషేకానికివెళ్తూ అతడిని పెంచసాగారు. ఆబాలుడు ఆఱుముఖాలతో పాలుత్రాగాడు. అతడికి షణ్ముఖుడు మొ॥ పేర్లు ఏర్పడ్డాయి. ఏ పేరు ఎలా ఏర్పడిందో చూడండి :—

| పేరు | | కారణము |
|---|---|---|
| 1) షణ్ముఖుడు | : | ఆరుగురు మునిపత్నుల పాలు త్రాగటానికి ఆరు ముఖాలతో ప్రత్యక్షమయ్యాడు. |
| 2) స్కందుడు | : | దేవతలను ద్వేషించే రాక్షసగణాలన్ని అతడిని చూచి స్కందించాయి. అంటే పారిపోయాయి. |
| 3) కార్తికేయుడు | : | కృత్తికాదేవతలచే పెంచబడ్డాడు. |

ఆ కుమారస్వామి ఆవులిస్తూండగా అతని నోటినుండి అగ్నిజ్వాలలు వచ్చాయి. అతడి శక్తి తిరుగులేనిది. దేవతలు అతడికి కొన్ని వస్తువుల నిచ్చారు. ఆ వివరాలు చూడండి—

| దేవుని పేరు | ఇచ్చినవస్తువు |
|---|---|
| 1) విష్ణువు | నెమలి, కోడి |
| 2) వాయుదేవుడు | జెండా |
| 3) సరస్వతి | గొప్పవీణ |
| 4) బ్రహ్మ | మేక |
| 5) శివుడు | గొఱ్ఱె |

విష్ణువు ఆడుకోవడానికి నెమలిని కోడిని ప్రసాదించాడు. ఇవి గరుత్మంతుడి కంటె గొప్పవి.

కుమారస్వామి క్రౌంచపర్వతాన్ని ఛేదించడం, తారకాసురుడిని సంహరించడం చేసాక దేవతలందరు కుమారస్వామిని సేనాధిపతిని చేసారు.

ఇలా కుమారస్వామి సేనాధిపతి అయ్యాడు.

కుమారస్వామి అన్నిలోకాలకు, ప్రమథగణాలన్నింటికి, భూతాలకు అధిపతి.

శివునియొక్క తేజస్సును ధరించిన అగ్నియొక్క తేజస్సు తగ్గింది. ఆ తేజస్సును భరించలేక అగ్నితిరుగుతూఉంటే గంగానది కన్పించింది. 'ఓ గంగా! నీవు ఈతేజస్సును భరించు. నీకు పుత్రుడు జన్మిస్తాడు. నేను భరించలేకుండా ఉన్నాను' అన్నాడు అగ్ని. అందుకు గంగ అంగీకరించి తేజస్సును భరించింది. శివతేజస్సును ఐదువేలసంవత్సరాలు ధరించడంవలన అగ్నియొక్క మాంసము, ఎముకలు, రక్తము, మేదస్సు. మజ్జ, రోమములు, గడ్డము, కన్నులు, కేశములు అన్ని బంగారంగా మారిపోయాయి. అప్పటి నుండి అగ్నిదేవునికి హిరణ్యరేతస్కుడు అనేపేరు వచ్చింది. గంగ ఐదువేల సంవత్సరాలు ధరించి ఇంక ధరించలేకపోయింది. గంగ బ్రహ్మను సమీపించి తాను భరించలేనని తెలుపగా, బ్రహ్మ ఇలా అన్నాడు. "ఓగంగా! నీవు ఉదయపర్వతం వద్దకువెళ్ళు. ఆపర్వతంపై నూఱుయోజనాల విస్తీర్ణత గల శివసంబంధమైన తెల్లుతోట ఉంది. అక్కడ నీవు ధరిస్తున్న శివతేజస్సు నుంచు. పదివేలసంవత్సరాలయ్యాక అక్కడ బాలుడు జన్మిస్తాడు." సరిగ్గా గంగ అలాగేచేసింది.

సమయం పూర్తికాగా సూర్యుడిలా వెలుగుతున్న బాలుడు జన్మించాడు. నోటిలో వ్రేలుపెట్టుకుని ఏడవడం ప్రారంభించాడు. అది మేఘగర్జనలా ఉంది. ఆ బాలుడినిచూచి షట్కృత్తికలు తమంతటతామే వచ్చి పాలిచ్చిపెంచారు. అందుకే ఆబాలుడు కార్తికేయుడయ్యాడు. అక్కడ దేవలోకంలో బ్రహ్మ శరవణంలో నీకుమారుడు పెరుగుతున్నాడని చెప్పాడు. అదివిని కుమారుడిని చూడాలని వేగంగా వెల్తూఉంటే గంగ ప్రశ్నించింది. కుమారుడిని చూడడానికి వెల్తున్నానని చెప్పగా, గంగకూడ బయలుదేరి నాకుమారుడే అని

వాదింపసాగింది. ఇంతలో విష్ణువు వచ్చి విషయంవిని రుద్రుడు ఎవరి కుమారుడని నిర్ణయిస్తే వారి కుమారుడని సలహాయిచ్చాడు. గంగ, అగ్ని శంకరుడికి విషయంచెప్పి ప్రశ్నించారు. శంకరుడు పార్వతితో మనకు కుమారుడు జన్మించాడని సంతోషంతో చెప్పాడు. పార్వతి 'ఆబాలుడినే అడుగుదాం. ఎవరికుమారుడో?' అంది. అగ్ని, గంగ, శివపార్వతులు అందరూ కలసి ఆతోటలోకి వెళ్లేసరికి ఆబాలుడు కృత్తికలో ఒడిలో ఉన్నాడు. ఆబాలుడు వచ్చినవారందరిని చూచి వారిభావం గ్రహించి తన యోగశక్తితో నలుగురిగా మారాడు.

ఒక బాలుడు శంకరుడిని సమీపించాడు. అతడు కుమారస్వామి అయ్యాడు. ఇంకొక బాలుడు పార్వతివద్దకు వెళ్లాడు. అతడిపేరు విశాఖుడు. గంగవద్దకు వెళ్లిన బాలుడు శాఖుడయ్యాడు అగ్నిచెంతకు వెళ్లినబాలుడు నైగమేయుడయ్యాడు. శివుడు ఆబాలుడికి ఏయేపేరు ఎలావస్తుందో తెలిపాడు. ఆపద్ధతి యిది.

| పేరు | ఎవనిపుత్రుడు? | కారణం |
|---|---|---|
| 1) కార్తికేయుడు | కృత్తికల పుత్రుడు | కృత్తికలు పెంచడం |
| 2) కుమారస్వామి | గంగకు పుత్రుడు | గంగ శివతేజస్సును ధరించడం |
| 3) స్కందుడు | పార్వతీపుత్రుడు | శివతేజస్సు స్రవించడం |
| 4) గుహుడు | శివుని పుత్రుడు | శివసంబంధ తేజస్సు అవడం |
| 5) మహాసేనుడు | అగ్నిపుత్రుడు | అగ్నిశివతేజస్సును ధరించడం |
| 6) సారస్వతుడు | బెల్లుతోటకు పుత్రుడు | బెల్లుతోటలో జన్మించడం |
| 7) షణ్ముఖుడు | — | ఆరు అంశలతోకూడడం |

తరువాత శివుడు బ్రహ్మను స్మరించగా బ్రహ్మ, దేవతలు వచ్చారు. కురుక్షేత్రానికివెళ్లి సరస్వతీనదీజలంతో అభిషేకంచేసి దేవసేనలకు ప్రభువుగా కుమారస్వామిని చేసారు. పార్వతీదేవి అభిషేకంచేసిన నీటితో తడిసిన కుమారస్వామి శిరస్సును ఆప్యాయంగా స్పృశించింది. శివుడు కుమారస్వామికి

ుగురు ప్రమథుల్ని యిచ్చాడు. వారు ఇంద్రునివంటివారు. వారు ) ఘంటాకర్ణుడు 2) లోహితాక్షుడు 3) నందిషేణుడు 4) కుముదమాలి.

శివుడు ప్రమథులను యివ్వడంచూచిన ఇతరదేవతలుగూడ ప్రమథులను ిచ్చారు. ఆ వివరాలు యివి.

| దేవతలు | ప్రమథులు |
|---|---|
| 1) బ్రహ్మ | స్థాణువు |
| 2) విష్ణువు | సంక్రముడు, విక్రముడు, పరాక్రముడు |
| 3) ఇంద్రుడు | ఉత్క్రోశుడు, పంకజుడు |
| 4) సూర్యుడు | దండుడు, కపింజలుడు |
| 5) చంద్రుడు | మణి, వసుమణి |
| 6) అశ్వనీదేవతలు | వత్సుడు, నంది |
| 7) అగ్ని | జ్యోతి, జ్వలజ్జిహ్వుడు, పురుడు |
| 8) ధాత | కుందుడు, ముకుందుడు, కుసుముడు |
| 9) త్వష్ట | చక్రుడు, అనుచక్రుడు |
| 0) వేధ | నిస్థిరుడు, సుస్థిరుడు |
| 1) పూష | పాణిత్యజుడు, కాలికుడు |
| 2) హిమవంతుడు | స్వర్ణమాలుడు, ఘనాహ్వుడు |
| 3) వింధ్యుడు | అతికృష్ణుడు |
| 4) వరుణుడు | సువర్చసుడు, అతివర్చసుడు, సంగ్రహుడు, విగ్రహుడు |
| 5) నాగులు | జయుడు, పరాజయుడు |
| 6) అంబిక | ఉన్మాదుడు, శంకుకర్ణుడు, పుష్పదంతుడు |
| 7) వాయువు | ఘసుడు, అతిఘసుడు |
| 8) అంశుమంతుడు | పరిఘుడు, వటకుడు, భీముడు, దాహుడు, అతిదహనుడు |
| 9) యముడు | ప్రమథుడు, ఉన్మాథుడు, కాలసేనుడు, మహాముఖుడు, తాలపత్రుడు, కాలజంఘుడు |
| 20) ధాత | సుప్రభుడు, శుభకర్ముడు |
| 21) మిత్రుడు | సువ్రతుడు, సత్యసంధుడు |

| | దేవతలు | ప్రమథులు |
|---|---|---|
| 22) | యక్షులు | అనంతుడు, శంకుపీరుడు, నికుంభుడు, కుముదుడు, అంబుజుడు, ఏకాక్షుడు, కునటి, చక్షుస్సు, కిరీటి కలశోదరుడు, సూచీవక్త్రుడు, కోకనదుడు, ప్రహాసుడు, ప్రియకుడు, అచ్యుతుడు |
| 23) | కాళింది | కలకందుడు |
| 24) | నర్మద | రణోత్కటుడు |
| 25) | గోదావరి | సిద్ధయాత్రుడు |
| 26) | తమస | సాద్రి, కంపకుడు |
| 27) | శీత | సహస్రబాహువు |
| 28) | వంజుళ | స్మితోదరుడు |
| 29) | మందాకిని | గంధుడు |
| 30) | విపాశ | ప్రియంకరుడు |
| 31) | ఐరావతి | చతుర్దంష్ట్రుడు |
| 32) | వితస్త | షోడశుడు |
| 33) | కౌశికి | మాజరి |
| 34) | గౌతమి | క్రథుడు, క్రౌంచుడు |
| 35) | బాహుద | శతశీర్షుడు |
| 36) | వాహ | గోనందుడు, నందికుడు |
| 37) | భీమరథి | భీముడు |
| 38) | సరయూ | వేగారి |
| 39) | కాళి | అష్టబాహువు |
| 40) | గండకి | సుబాహువు |
| 41) | మహానది | చిత్రదేవుడు |
| 42) | శిప్ర | చిత్రరథుడు |
| 43) | కుహూ | కువలయుడు |
| 44) | మధూదక | మధువర్ణుడు |
| 45) | ధూతపాప | జంబుకుడు, మహారావుడు |
| 46) | వేత్ర | శ్వేతాననుడు |
| 47) | వర్ణ | స్తుతుడు |

| | దేవతలు | ప్రమథులు |
|---|---|---|
| 48) | రేవ | సాగరవేగి |
| 49) | ప్రభావ | అర్థసహుడు |
| 50) | కాంచన | కనకేక్షణుడు |
| 51) | విమల | గృధ్రవక్త్రుడు |
| 52) | మనోహర | చారుపత్రుడు |
| 53) | కర్ణ | విద్రుమసన్నిభుడు |
| 54) | జిష్ణువు | సుప్రసాదుడు |
| 55) | ఓఘవతి | సువేణువు |
| 56) | విశాల | యజ్ఞబాహువు |
| 57) | సరస్వతులు | గణాలు |
| 58) | కుటిల | కరాళుడు, సితకోశుడు, కృష్ణకేశుడు, జటాధరుడు, మేఘనాదుడు, చతుర్దంష్ట్రుడు, విద్యుజ్జిహ్వుడు, దశాననుడు,సోమాప్యాయనుడు, ఉగ్రుడు,దేవయాజి. |
| 59) | కృత్తికలు | హంసాస్యుడు, కుండజఠరుడు, ముద్గగ్రీవుడు, హయాననుడు, కూర్మగ్రీవుడు |
| 60) | ఋషులు | స్థాణుజంఘుడు, కుంభవక్త్రుడు, లోహజంఘుడు, మహాననుడు, పిండాకారుడు |
| 61) | పృథూదకతీర్థము | నాగజిహ్వుడు, చంద్రభాసుడు, పాణికూర్ముడు, అశిక్షకుడు, చాషవక్త్రుడు, జంబూకుడు |
| 62) | గయాశిర స్తీర్థము | మకరుడు |
| 63) | చక్రతీర్థము | సుచక్రుడు |
| 64) | కనఖలక్షేత్రము | పంచశివుడు |
| 65) | ఆజిశిర | బంధుదత్తుడు |
| 66) | పుష్కరము | బాహుశాలుడు |
| 67) | మానసము | సర్వౌజసుడు, మాహిషకుడు, పింగలుడు |
| 68) | ఔశనసుడు | రుద్రుడు |
| 69) | సోమతీర్థము | వసుదాముడు |
| 70) | ప్రభాసము | నందిని |
| 71) | ఇంద్రతీర్థము | విశోక |

| | దేవతలు | ప్రమథులు |
|---|---|---|
| 72) | ఉదపానము | ఘనస్వన |
| 73) | సప్తమాతృకలు | నాల్గుసముద్రాలు |
| 74) | నాగతీర్థము | గీతప్రియ, మాధవి, తీర్థనేమి, స్మితాపన ఏకచూడ |
| 75) | కురుక్షేత్రము | ఫలాస్పద |
| 76) | బ్రహ్మయోని | చండశిత |
| 77) | భద్రకాళి | త్రివిష్టపుడు |
| 78) | ద్విరదపావనుడు | రోండి, సేండి, పోష, భేడీ |
| 79) | భూమి | మోపరీయ |
| 80) | మానససరస్సు | శాలిగ |
| 81) | శతానంద | శతఘంట, ఉలూఖలమేఖల |
| 82) | బదరికాశ్రమము | పద్మావతి, మాధవి |
| 83) | దేవి | సుషమ, ఏకచూడ, ధమధమ |
| 84) | ఉక్రాథని | వేదమంత్ర |
| 85) | కేదారము | తల్లులు |
| 86) | సునక్షత్రము | కటాల |
| 87) | సుమంగలము | సుప్రభాతము |
| 88) | రౌద్రమహాలయము | దేవమిత్ర, చిత్రసేన |
| 89) | ప్రయాగ | కోటర, మూర్ధవేణి, శ్రీమతి, బాహుపుత్రిక పతిత, కమలాక్షి |
| 90) | సర్వపాపవిమోచనము | సుయమ, మధుపి, గోవు, క్షాంతి, దహదహ, పర, ఖేటకర, అన్య |
| 91) | సుదామ | సంతానిక, వికల, క్రముకాంబరవాసిని, జలేశ్వరి, కర్కుటిక, లోహమేఖల |
| 92) | శ్వేతతీర్థము | వపుష్మతి, ఉల్ముకాక్షి, కోక, మహాసని, రౌద్ర, కర్కటిక, తుండ |
| 93) | గరుత్మంతుడు | నెమలి (గరుత్మంతుని పుత్రుడు |
| 94) | అరుణుడు | తామ్రచూడుడు (అరుణుని కొడుకు) |
| 95) | అగ్ని | శక్తిఅనే ఆయుధము |

| దేవతలు | ప్రమథులు |
|---|---|
| 96) పార్వతి | వస్త్రము |
| 97) బృహస్పతి | దండము |
| 98) గంగ | కమండలము |
| 99) విష్ణువు | మాల |
| 100) శూలధరుడు | పతాక |
| 101) ఇంద్రుడు | ముత్యాలదండ |

ఇలా దేవతలనుండి, ఆయుధాలు, గణాలనుపొంది సైన్యాధిపతియై సూర్యుడిలాగా ప్రకాశించాడు కుమారస్వామి.

## కుమారస్వామి విజయాలు

మునులు, దేవతలు కుమారస్వామిని చూడడానికి భయపడి ఇంద్రుని వద్దకు వెళ్లి కుమారస్వామి ఇంద్రపదవికై ప్రయత్నించేస్తున్నాడని భయ పెట్టారు. ఇంద్రుడు సప్తమాతృకలను పిలిచి వారిని కుమారస్వామిని చంప డానికి పంపించాడు. వారు కుమారస్వామి తపస్సునుచూచి భయపడి శరణు వేడారు. కుమారుడు వారిని తల్లులుగా భావించి బాలగ్రహాలుగా చేసాడు అంతకుముందు సప్తమాతృకల కోపంవలన లోహితాస్య అనే ఆమె జన్మించి కుమారస్వామికి దాది అయింది. తరువాత ఇంద్రుడే స్వయంగా యుద్ధానికి వచ్చి వజ్రాయుధం ప్రయోగించాడు. అది అతని కుడిభాగాన్ని తాకింది, అక్కడినుండి విశాఖుడు అనేవాడు జన్మించాడు. ఇంకా అనేకకన్యలు, బాలురు జన్మించారు. అది చూచి యింద్రుడు భయపడి కుమారస్వామిని శరణువేడి తన యింద్రపదవి తీసుకోమని అడిగాడు. కుమారస్వామి తనకు ఇంద్రపదవిపై ఆశలేదని తిరస్కరించాడు. ఇంద్రుడు బ్రతిమిలాడగా ఇంద్రునికి సేనాధిపతి అయ్యాడు.

తరువాత కొంతకాలానికి శూరపద్మాసురుడు అనేరాక్షసుడు కుమార స్వామిపై యుద్ధానికి వచ్చాడు. కుమారస్వామి అవలీలగా అతడిని జయించాడు. ఇంద్రుడు మెచ్చుకొని తన కుమార్తెఅయిన దేవసేననిచ్చి వివాహం చేసాడు.

కుమారస్వామి లోకకంటకుడైన తారకాసురుడిని చంపి లోకానికి మేలు కలిగించాడు.

## కుమారస్వామి మహిషాసురుని, అంధకాసురుని చంపుట

కుమారస్వామిని దేవతలందరు తమ సైన్యాధిపతిగా నిర్ణయించి అనేక ఆయుధాలను, గణాలను యిచ్చాడు. కుమారస్వామి బ్రహ్మకు, శివపార్వతులకు, కృత్తికలకు, అగ్నికి, గంగకు నమస్కరించి మీ ఆశీస్సువలన మహిషాసురుడిని, తారకాసురుడిని జయించగలనని ఆశాభావాన్ని వ్యక్తం చేసాడు. శివుడు సంతోషంతో కుడిచేతితో బ్రహ్మను పట్టుకుని స్కందునివద్దకు వచ్చాడు. పార్వతి విష్ణువుకు నమస్కరించమని కుమారునితో చెప్పింది. విష్ణువు పరతత్త్వమని శివుడుచెప్పినట్లు చెప్పింది. కుమారస్వామి విష్ణువుకు నమస్కరించాడు. చేతులుజోడించి నమస్కరించిన కుమారస్వామిని సమీపించి యుద్ధంలో విజయం కలగాలని స్వస్త్యయనం (విజయం యిచ్చే ఆశీర్వాదము) చేసాడు.

తరువాత కుమారస్వామి శక్తినిధరించి ఆకాశంలో యుద్ధానికి బయలుదేరాడు. దేవతలు, మునులు, గణాలు అంతా కుమారస్వామివెంట అకాశంలో బయలుదేరారు. అలా చాలాదూరం వెళ్లాక భూమిపైన విడిదివేద్దామని చెప్పాడు కుమారస్వామి. సరే అని అందరూ భూమిపైకిదిగి క్రౌంచపర్వతాన్ని సమీపించి భయంకరంగా ధ్వనిచేసారు. అధ్వని భూమి, ఆకాశం అంతా వ్యాపించి సముద్రం అడుగుకువెళ్లి పాతాళలోకంచేరి రాక్షసులను భయపెట్టింది. మహిషుడు, తారకుడు, విరోచనుడు, కుంభుడు వజ్రంపడ్డట్టుగా ఉన్న ఆనాదం విని భయపడి అంధకాసురుని వద్దకువెళ్లారు. వారంతా సంభాషణ చేస్తూఉండగా పందివంటి ముఖంగల పాతాళికేతువు అనే రాక్షసుడు రసాతలానికి వచ్చాడు. అతడి శరీరంలో బాణం దిగబడిఉంది. బాగా వణుకుతున్నాడు. అతడు అంధకాసురునితో ఇలా చెప్పాడు.

"ఓ అంధకా! నేను గాలవమునియొక్క ఆశ్రమం ధ్వంసం చెయ్యడానికి పూనుకున్నాను. నేను పంది ఆకారంలో ఆశ్రమంలో చొరబడ్డాను. అదే సమయానికి నన్ను బాణంతో ఎవరోకొట్టారు. నేను దెబ్బతిని పరుగెత్తాను. అతడు నావెంటబడ్డాడు. వెనకాల గుఱ్ఱపుడెక్కల చప్పుడు వినిపిస్తోంది. ఆగు, ఆగు అని ఎవరో అరుస్తున్నారు. నేను వేగంగాపరుగెత్తి

దక్షిణసముద్రం చేరుకున్నాను. అక్కడ అనేకవేషాలతో అనేకమంది మేఘాల్లాగా గర్జిస్తున్నారు. మహిషాసురుడిని, తారకాసురుడిని చంపుతామని కేకలువేస్తున్నారు. నాకు భయంకలిగి నేను సముద్రంవిడచి భూమిపైగల ఒక గుంటద్వారా నాహిరణ్యపురం విడచి పరుగెత్తుకుంటూ వచ్చాను. అయితే ఆగుంట విశాలం అవడంవలన అతడు నావెంటపడుతున్నాడు."

## ప్రమథగణాలు రాక్షసులతో పోరాడుట

అది విని అంధకాసురుడు అభయం ఇచ్చాడు. మహిషుడిని, తారకుడిని బాణుడు మొ॥ వారందరు అనుసరిస్తూ యుద్ధానికి వచ్చారు. వారినిచూచి కొందరు దేవతలు పలాయనం చిత్తగించారు. మాతృదేవతలకు ముందున్న స్థాణువు పరిఘ అనే ఆయుధం తీసుకుని కోపగించిన రుద్రుడై రాక్షసులను చంపసాగాడు. అలాంటి శివుడినిచూచి కలశోదరుడు గొడ్డలిని తీసుకుని రాక్షసులను చంపసాగాడు. జ్వాలాముఖుడు రథము, ఏనుగు, గుఱ్ఱములతో సహ రాక్షసుడిని పట్టుకుని నోట్లోపడవేసాడు. కోపగించిన దండకుడు అనే దేవుడు ప్రాసపట్టుకున్న రాక్షసుడిని వాహనంతోసహా సముద్రంలో పడ వేసాడు. పౌరుషంలేని రాజును మంత్రి చూర్ణంచేసినట్లే శంకుకర్ణుడనే దేవుడు నాగలి, రోకలి ధరించి రాక్షసులను నుగ్గునుగ్గుచేయసాగాడు. ఖడ్గము, చర్మం ధరించిన పుష్పదంతుడనే ప్రమథుడు రాక్షసులను రెండుగా, మూడుగా ఇంకా అనేకఖండాలుగా చేయసాగాడు. పింగలుడు దండంధరించి ఎక్కడెక్కడ తిరుగుతూఉంటే అక్కడక్కడ రాక్షసులు చిందరవందరై కనుపించసాగారు.

ఇంద్రుడు శూలం త్రిప్పుతూ రథాలు, గుఱ్ఱాలు, ఏనుగులతో సహ రాక్షసులను చంపసాగాడు. ఇంద్రుడు వజ్రాయుధంతో కొండలను నరికినట్లు భీముడనే ప్రమథుడు భయంకరమైన రాళ్లను విసరుతూ రాక్షసులను చంప సాగాడు. శకటచక్రుడు అనే ప్రమథుడు ముద్గరంత్రిప్పుతూ చంపసాగాడు. గిరిభేది ఏనుగును, దానిపై ఉన్నవాడిని, సారథితోసహ భస్మంచేసాడు. నాడీజంఘుడు పిడికిలిపోట్లతో చంపడం ప్రారంభించాడు. కూర్మగ్రీవుడు తలతోటి, హయగ్రీవుడు కాళ్లతోటి రాక్షసుల్ని దూరంగా లాక్కెళ్లి చంపారు. పిండాకరుడు నోటితోటి, కలిప్రియుడు కొమ్ముతోకూడిన ఆయుధాలతో

రాక్షసులను చీల్చిచెండాడారు. ఇదంతాచూచిన తారకుడు, మహిషుడు పారిపోయారు. ఇంతలో మిగిలిన రాక్షసులు ప్రమథులపైబడ్డారు. తిరిగి దేవతలకు కోపంవచ్చి తీవ్రంగా యుద్ధానికి దిగారు

హంసాస్యుడు పట్టిశం అనే ఆయుధంతో మహిషుడిని పట్టుకుని పొడిచాడు. షోడశాస్యుడు త్రిశూలంతో, గతశీర్షుడు ఖడ్గంతో, శ్రుతాయుధుడు గదతో, విశోకుడు రోకలితో, బంధుదత్తుడు శూలంతో మహిషుడి తలపై కొట్టారు. ఇతరగణాలు కూడ శూలము, శక్తి, పట్టిశములతో ఛేదిస్తున్నా మైనాకపర్వతంలాగా ఏమాత్రం చలించలేదు. భద్రకాళి, ఉలూఖల తారకుడిని బంధించారు. అనేకచూడఆయుధాలతో చీల్చసాగింది. ఇంత జరుగుతున్నా మహిషుడు, తారకుడు ఏమాత్రం చలించకుండ గణాలను కలతపెట్ట సాగారు.

మహిషుడు గదతో ప్రమథులను జయించి కుమారస్వామి వద్దకు వెళ్లాడు. చక్రాక్షుడు యిది చూచి చక్రం ధరించి మహిషుడి దగ్గఱకు వచ్చాడు. వారిద్దరూ పోరాడారు. మహిషుడు గదప్రయోగిస్తే చక్రాక్షుడు చక్రం ప్రయోగించాడు. గదను ముక్కలుచేసి చక్రాయుధం మహిషుడి వెంటబడింది. మహిషుడు మరణిస్తున్నాడని రాక్షసులు ఆక్రోశించారు. బాణాసురుడు ప్రాసను ప్రయోగించిన చక్రం ఖండించినది. ఐదువందల చేతులతో ఐదువందల పిడికిలిపోట్లతో చక్రాక్షుడిని బంధించాడు. చక్రాక్షుడు కట్టుబడడం చూచి బలవంతుడైన మకరాక్షుడు గద ధరించి దానితో తలమీదకొట్టాడు. అతడు సిగ్గుపడి యుద్ధంవిడచి శాలిగ్రామానికి చేరుకున్నాడు. మకరాక్షుడి దెబ్బకు తాళలేక వెనుదిరిగి వెళ్లాడు. రాక్షసులబలం అంతాపోయింది.

తనబలం అంతా భగ్నంఅవడం చూచిన తారకుడు ఖడ్గం ధరించి గణాధిపతులపైకి వచ్చాడు. తారకుని భరించలేక హంసవక్త్రుడు మొ॥ వారంతా, మాతృదేవతలు యుద్ధంలో ఓడిపోయి స్కందుడిని శరణువేడారు. కుమారస్వామి శక్తితో మహిషుడి హృదయం భేదించాడు. తారకుడు మరణించాడు. ఇలా తన సోదరుడు మరణించడంచూచి మహిషుడు యుద్ధం మాని హిమాలయాలలోకి వెళ్లిపోయాడు. బాణుడు భయపడి సముద్రంలోకి భయంతో పారిపోయాడు.

కుమారస్వామి ఇలా తారకుడిని జయించి నెమలివాహనం ఎక్కి శక్తి ధరించి మహిషుడిని చంపడానికి బయలుదేరాడు. మహిషుడు హిమాలయాన్ని, కైలాసాన్ని విడచిపెట్టి క్రౌంచపర్వత గుహలోకి పారిపోయాడు.

కుమారస్వామికి క్రౌంచపర్వతం బంధువు తన బంధువుని చంపడం ఎలాగని ధర్మసంశయంలో పడ్డాడు. ఇంతలో బ్రహ్మ విష్ణురుద్రులు, ఇంద్రుడు కుమారస్వామి వద్దకువచ్చి శక్తిని ప్రయోగించి క్రౌంచపర్వతాన్ని ఛేదించ మని చెప్పారు. "ఈ క్రౌంచపర్వతం మామాతామహుని మునిమనుమడు. మామేనమామ కుమారుడు. నాకు సోదరునివంటివాడు. వేదంకూడ యిలాగే చెబుతూంది.

"గాం బ్రాహ్మణం వృద్ధమథావి చాఢ్యమ్
బాలం స్వబంధుం లలనాం సుదుష్టామ్
కృతాపరాధామపి నైవ వధ్యాత్
ఆచార్యముఖ్యా గురవస్తథైవ" వా. - 58 - 93

అవును, బ్రాహ్మణుడిని, వృద్ధుడిని, ధనవంతుడిని, బాలుడిని, బంధువును, స్త్రీని, గురువులను తప్పుచేసినా ఇంకొకవిధంగా శిక్షించాలిగాని చంప కూడదు. కనుక ధర్మాన్ని తెలిసిననేను నామేనత్తకొడుకును చంపలేను. మహిషుడు ఎప్పుడు బయటకువస్తాడో శక్తితో అప్పుడే చంపుతాను.

కాని దానికి ఇంద్రుడంగీకరించలేదు. "నీవు మత్తుడవై సరిగ్గావిచారించి చెప్పలేకపోతున్నావు. విష్ణువు లోగడ ఏమిచెప్పాడో ఆలోచించు. ఒకడికోసం ఎక్కువమందిని చంపకూడదు. అనేకమందికొఱకు ఒకడినిచంపినా పాపం రాదు. ఈ నియమాన్నే పాటించిననేను నాసోదరుడైనా దుర్మార్గుడైన నముచిని చంపాను. అందుకే అనేకమందికి సుఖం కలగడానికై మహిషుడితో కూడిన క్రౌంచపర్వతాన్ని భేదించు." అన్నాడు ఇంద్రుడు.

ఇది విన్న కుమారస్వామికి కోపంవచ్చి కళ్లు ఎఱ్ఱబడ్డాయి. "మూఢుడా! నీబాహుబలం ఎంత? శరీరబలం ఎంత? నీవు నన్నాక్షేపిస్తూ బుద్ధిమంతుడివి అనుకుంటున్నావు." దానికి ఇంద్రుడు తాను చాలా బలవంతుడినని చెప్పాడు. అలా అయితే నాతో యుద్ధానికి రమ్మనమని అన్నాడు కుమారస్వామి. ఎవరు ముందు ఈ క్రౌంచపర్వతాన్ని చుట్టివస్తారో వారే బలవంతులు అన్నాడు ఇంద్రుడు. వెంటనే కుమారస్వామి నెమలివాహనం విడచిపెట్టి కాలినడకన

ప్రదక్షిణం చేయడానికి పూనుకున్నాడు. ఇంద్రుడు ఏనుగుదిగి ప్రదక్షిణం చేసినట్లు నిల్చున్నాడు. కుమారస్వామిరాగా నేనే ముందు ప్రదక్షిణంచేసానని అబద్ధం చెప్పాడు. వారిద్దరు నేనుముందు చేసానంటే నేనని వాదించుకుంటూ త్రిమూర్తులవద్దకు వచ్చారు. విష్ణువు "ఈవాదం ఎందుకు? క్రౌంచపర్వతం ఎవరుముందు చేసారంటే వారిదే గెలుపు. ఆకొండనే అడగండి" అన్నాడు. కుమారస్వామి క్రౌంచపర్వతాన్నే అడిగాడు. అందుకు క్రౌంచపర్వతం 'ముందు ఇంద్రుడే చేసాడు. తరువాతనే నీవు చేసావు' అంది.

ఇది విన్న కుమారస్వామికి కోపంవచ్చి కళ్లు ఎఱ్ఱబడ్డాయి. వెంటనే శక్తి ఆయుధం ప్రయోగించి మహిషాసురుడితోసహ క్రౌంచపర్వతాన్ని భేదించాడు. ఇలా మహిషుడు మరణించడం చూచిన దేవతలు సంతోషంతో స్వర్గానికివెళ్లి పోయారు. సునాభపర్వతం గుండెల్లో దిగినశక్తినితీసి కుమారస్వామి ఆతనిని చంపబోగా విష్ణువు మేనమామకను కవిడచి పెట్టమన్నాడు.ఇంతలో హిమవంతుడు వచ్చి సునాభుడిని యింటికి తీసుకువెళ్లాడు. అప్పుడు కుమారస్వామి విష్ణువును ఇంద్రుడినిచూచి "మామేనమామ కొడుకును కొట్టాను. ఆపాపం పోవడానికి నాశరీరాన్ని శుష్కింపజేస్తాను" అన్నాడు కుమారుడు. అప్పుడు విష్ణువు "పృథూదక తీర్థానికివెళ్లి అక్కడ స్నానంచేసి శివుడినిచూస్తే నీవు సూర్యుడంతటివాడివి అవుతావు" అన్నాడు విష్ణువు. కుమారస్వామి పృథూదకతీర్థంలో స్నానంచేసి శివసందర్శనంచేత పవిత్రుడై సూర్యకాంతితో వెలుగుతూ కైలాసానికివెళ్లి అక్కడ గాలిమాత్రం గ్రహిస్తూ తపస్సుచేసి శంకరుడిని మెప్పించాడు. బాణాసురుని చేతులను అవలీలగా తన బాహువుతో ఖండించే శక్తికావాలని శివుడిని అడిగాడు. "నీచక్రాయుధానికి అలాంటి శక్తివస్తుంది" అని శంకరుడు వరం యిచ్చాడు.

ఇలా కుమారస్వామి అనేక విజయాలను సాధించాడు.

## దేవసేన ఎవరు?

కుమారస్వామి భార్య దేవసేన. ఈమెకు షష్ఠీదేవి యనిపేరు.

పూర్వం దేవతలకు రాక్షసులకు యుద్ధంరాగా దానిలో దానవులు దేవతల నోడించారు. ఇంద్రుడు మానసమనే పర్వతంవద్దకు వెళ్లి అక్కడ ఉపాయంకోసం దీర్ఘంగా ఆలోచిస్తూ ఒక స్త్రీ ఆర్తనాదం విన్నాడు. "నావద్దకు ఎవరైనావచ్చి కాపాడి, నాకు తగిన భర్తను చూపించడమో లేక

స్వయంగా పతిగా అవడమో చేయండి" అని. ఇంద్రుడు త్వరగావెళ్లి కేశి అనే రాక్షసుడు ఒక స్త్రీని బాధించడం చూచాడు. ఇంద్రుడుచెప్పినా కేశి వినలేదు. వారిద్దరికీ యుద్ధం జరిగింది. యుద్ధంలో ఓడిపోయి కేశి పారిపోయాడు. ఆ అమ్మాయి యిలా చెప్పింది. "మాతండ్రి ప్రజాపతి. నా పేరు దేవసేన. నాసోదరి దైత్యసేన. కేశి దైత్యసేనను వివాహమాడాడు. నాకు కేశి అంటే యిష్టంలేదు. ఇప్పుడు నువ్వు విడిపించావు."

అది విని యింద్రుడిలా అన్నాడు. "నీవు మాపిన్నికుమార్తెవు. నాకు సోదరివి. నీకు ఎలాంటి భర్తకావాలి?" సర్వభూతాలను జయించగలిగి బ్రహ్మణ్యుడు, కీర్తివర్ధనుడు అయిన భర్తకావాలి" అంది దేవసేన. అటువంటి మహాత్ముడు ఎలా లభిస్తాడా అని ఆలోచించసాగాడు ఇంద్రుడు. అప్పుడు అమావాస్య. అది రౌద్రముహూర్తం. ఉదయపర్వతంపై దేవతలు రాక్షసులు యుద్ధం చేస్తున్నారు. సంధ్యాకాలంలో ఎఱ్ఱని మబ్బులకాంతితో పశ్చిమ సముద్రం ఎఱ్ఱబడింది. భృగువులు, ఆంగిరసులుచేసిన యజ్ఞంలో హవిస్సును తీసుకొని అగ్ని సూర్యుడిలో ప్రవేశించాడు. అదేసమయంలో రౌద్రుడు, ధర్మము, సూర్య, చంద్రులు, ఒక్కటయ్యారు. చంద్రసూర్యాగ్నులు ఒకటి అయిన ఈసమయంలో చంద్రుడుగాని అగ్నిగాని ఎవరిని సృష్టిస్తారో అతడు చాలా గొప్పవాడు. అతడే ఈమెకు తగినభర్త.

ఇలా అనుకున్న ఇంద్రుడు బ్రహ్మవద్దకు తనసోదరిని తీసుకువెళ్లాడు. బ్రహ్మ ఇంద్రుడు భావించినట్లే జరుగుతుందని చెప్పాడు.

వశిష్ఠుడు మొ॥ ఋషులు అగ్నిని పిలువగా అగ్ని సూర్యమండలం నుండి వచ్చాడు. హవిస్సును స్వీకరించాడు. వెల్తూ మధ్యలో నిద్రిస్తున్న సప్తర్షుల భార్యలను చూచాడు. అతడికి మోహం కలిగింది. కామాతురుడైన అగ్ని ఆహవనీయాగ్నిగామారి వారిని చూడసాగాడు. అగ్నిభార్య అయిన స్వాహాదేవి అది గమనించి ఆంగిరసుని భార్యఅయిన శివాదేవిగామారి అగ్నిని చేరింది. అగ్నితేజస్సును ధరించిన స్వాహ ఆడుగరుడపక్షిగా మారి అడవి నుండి వెళ్లి తెల్లుతోకూడిన శ్వేతపర్వతాన్ని చేరింది. చూపులతోనే విషాన్ని కక్కే ఏడుతలల నాగరాజులతో, రాక్షసులు, పిశాచాలతో ఆవనం నిండి ఉంది స్వాహ ఒక బంగారుకుండలో ఆతేజస్సును ఉంచింది. మిగిలిన అయిదుగురు ఋషిపత్నుల రూపంలోవెళ్లి అగ్నిని మురిపించి అగ్నితేజస్సును

తెచ్చి ఆరుసార్లు ఆకుండలో ఉంచింది. అరుంధతి మహాపతివ్రత కనుక ఆమె రూపంమాత్రం ధరించలేకపోయింది. ఆతేజస్సునుండి ఒక బాలుడు పుట్టాడు. స్వాహ తేజస్సును పాడ్యమినాడు ఉంచింది. ఆరు శిరస్సులతో కూడిన ఆబాలుడు త్రిపురాసురుడిని చంపిన శివుని ధనస్సుతీసుకుని అల్లెత్రాడు లాగి పెద్ద ధ్వని కలిగించాడు. ఆ ధ్వనికి చిత్రం, ఐరావత మవి ఏనుగులు కూడ వణికాయి.

ఆ బాలుడు రెండుచేతులతో రెండు ఏనుగులను, ఒకచేతితో శక్తిని, మఱియొకచేతితో కోడిని పట్టుకుని ఆడుకున్నాడు. రెండుచేతులతో శంఖం ఊదాడు. రెండుచేతులతో ఆకాశాన్ని తన్నుతూ ఆడుకొనసాగాడు. అన్ని ప్రాణులు ఆధ్వనికి భయపడగా వారిని ఓదార్చాడు కుమారస్వామి. ఆశ్వేత పర్వతంపై నిలబడిన కుమారస్వామి క్రౌంచపర్వతాన్ని బాణాలతోకొట్టి రంధ్రం చేసాడు. ఆరంధ్రం ద్వారా హంసలు, గ్రద్దలు మేరుపర్వతం వెళ్లడానికి దారిఏర్పడింది. అన్నిపర్వతాలు భయపడి ఆక్రోశించాయి. కుమారస్వామి శక్తి అనే ఆయుధంతో గర్వించిన శ్వేతపర్వతశిఖరాన్ని పడగొట్టాడు. ప్రాణులందరికీ అభయంయిచ్చి రక్షించాడు. ఆరోజు శుద్ధ పంచమి. ఆరోజే అందరూ ఆయనను నమస్కరించారు.

చైత్రరథం అనే వనంలోఉన్న మునులందరు తమ భార్యలను శంకించి వదలివేసారు. కొంతమంది ఈ అనర్థానికి కారణం స్వాహాదేవేనని నిందించారు. కాని ఎవ్వరికీ నిజం తెలియదు. ఆడుగరుడపక్షివేషంలో ఉన్న స్వాహాదేవి కుమారస్వామికి తల్లి అయింది.

పూర్వం విశ్వామిత్రముని యజ్ఞం పూర్తిచేసి కామవశుడైన అగ్నిని వెంటాడి అడవికివెళ్లి స్వాహయే ఋషిపత్నులుగా మారినవిషయం చూచాడు. కనుక విశ్వామిత్రునికి మాత్రం రహస్యం తెలుసు. విశ్వామిత్రుడు కుమార స్వామికి జాతకర్మాది సంస్కారాలుచెసాడు. కుమారస్వామిని, కోడిని, శక్తిని పూజించాడు విశ్వామిత్రుడు. లోకమాతృకలు అతడికి తల్లులయ్యారు. లోక మాతలయొక్క కోపంవలన ఒక స్త్రీ పుట్టింది. ఆమె శూలంధరించి కుమారుని ఎప్పుడూ కాపాడసాగింది. ఎఱ్ఱని సముద్రంనుండి పుట్టిన స్త్రీకూడ కుమారుడిని రక్షింపసాగింది. ఈమె ఆహారం రక్తం. అగ్నిమేకరూపం ధరించి ఆటవస్తువు లతో బాలుడిని ఆడించసాగాడు.

ఇంద్రుడు దేవతల దుర్బోధవలన కుమారస్వామితో ఘోరయుద్ధ చేసాడు. కుమారస్వామి నోటినుండి అగ్నిజ్వాలలను కురిపించాడు. ఇంద్రుడు వజ్రాయుధంతో కుమారుని కుడిపార్శ్వాన్ని కొట్టాడు. అక్కడినుండి విశాఖుడు జన్మించాడు. అగ్నిలా ప్రకాశిస్తున్న అతడినిచూచి ఇంద్రుడు భయపడి కుమారస్వామిని శరణువేడి సంధిచేసుకున్నాడు.

ఇంద్రుడు కొట్టిన వజ్రందెబ్బవలన విశాఖుని తరువాత కుమారస్వామి శరీరంనుండి ఇంకా చాలాపురుషులు, స్త్రీలు జన్మించారు. వీరు గర్భస్థశిశువును చంపుదురు. వారందరికీ విశాఖుడు తండ్రి. విశాఖుడు మేకముఖం కలవాడై వారందరితో కలసి స్వామిని రక్షింపసాగాడు. విశాఖుడిని చూడడానికివచ్చిన తల్లులతో భద్రశాఖుడు, కౌశలుడు ప్రసిద్ధులు.

తపస్సు అనే అగ్నినుండి కన్యలుపుట్టారు. కుమారస్వామి వారిని లోక మాతృకలను చేసాడు. కాకీ, హలిమా, రుద్రా, బృహవీ, ఆర్యా, పలాలా, మిత్రా వారిపేర్లు. వీరిప్రభావం వలన శిశువు అనే పుత్రుడు పుట్టాడు. వీరు ఎనిమిదిమంది. అగ్ని తొమ్మిదవవాడు. కుమారస్వామికిగల ఆరుముఖాలలోను మధ్య ముఖం మేకమోము. లోకమాతలు దీన్నే పూజిస్తారు. ఇదే ముఖ్యమైనది. దీనివలననే భద్రశాఖుడు శక్తిని సృష్టించాడు. ఇదంతా శుక్లపంచమి నాడు జరిగింది. షష్ఠినాడు యుద్ధం జరిగింది.

బంగారుకవచం, ఎఱ్ఱనివస్త్రాలు ధరించి ప్రకాశిస్తున్న స్వామిని సాక్షాత్తు లక్ష్మీదేవి సేవించింది. ఋషులందరూ కుమారస్వామినే ఇంద్రుడిగా ఉండమన్నారు. ఇంద్రుడు కూడ అలాగే కోరాడు. కాని స్వామి అంగీకరించక ఇంద్రపదవిని యింద్రుడికేయిచ్చి, రాక్షసులను చంపడానికి, దేవతలపనులు చేయడానికి గోబ్రాహ్మణులను కాపాడుటకు సేనాపతి అయ్యాడు. అతడికి అగ్ని కోడినిచ్చాడు. ఎఱ్ఱని జెండానుకూడ అలంకరించాడు. కవచం అతని శరీరంలోదాగి యుద్ధసమయాలలో అది బయటకు వస్తుంది. ఇంద్రుడువచ్చి దేవసేనను యిచ్చి కుమారస్వామికి వివాహం జరిపించాడు. బృహస్పతి వివాహమంత్రాలు చదివాడు. ఈ వివాహం షష్ఠిరోజు జరిగింది. ఈ తిథి సుఖాన్ని లక్ష్మిని భక్తులకిస్తుంది. సినీవాలి, కుహూ, సద్వృత్తి, అపరాజిత అనేవి షష్ఠికిగల పేర్లు. లక్ష్మి స్వయంగావచ్చి ఈరోజే స్వామిని సేవించింది. ఈ షష్ఠికి శ్రీపంచమి అనిపేరు.

ఋషిపత్నుల నిందతొలగించి వారికి మేలుచేసాడు. తరువాత ఇంద్రుడు, 'అభిజిత్తు రోహిణికంటె చిన్నఅని, పెద్దదికావాలని అడవికివెళ్లి తపస్సు చేస్తూందని ఒకనక్షత్రం ఆకాశంనుండి తొలగిందని, బ్రహ్మ ధనిష్ఠ నుండి కాలంనిర్మించినా మొదట రోహిణినుండి ఉండేదని చెప్పాడు. తరువాత కృత్తికలు ఆకాశంలోకివెళ్లి శకటాకారంగా నక్షత్రంగా మారారు.

వినతాదేవి స్వామినే పుత్రునిగా భావించింది. మాతృకలు స్వామి శక్తి వలన లోకమాతృకలయ్యారు.

## పిల్లలను బాధించే దుష్టశక్తులు

పూర్వం బ్రహ్మచే సృష్టింపబడిన లోకమాతలు కుమారస్వామికొఱకే ఈమాతృకల బిడ్డలను అపహరించాయి. ఆబాధ వీరికుండడంవలన, ఆమాతృకలకున్న స్థానంకంటె వీరికెక్కువ స్థానంకావాలని కోరారు. కుమారస్వామి అనుగ్రహించాడు. వీరే పూజింపబడుతున్నారు. పూర్వమాతృకలకు గౌరవం తగ్గింది. అపహరింపబడిన వీరిసంతానం తిరిగిరావడం కష్టంకనుక కుమారస్వామి ఇంకొకరీతిగా వీరిని అనుగ్రహించాడు. అప్పుడు లోకమాతలు ఇలా అన్నాయి. "స్వామీ! మాశత్రువులైన లోకమాతల బిడ్డలను మేము భక్షించేలా అనుగ్రహించు." అప్పుడుస్వామి "తల్లులారా! మీకోరిక చాలా బాధాకరంగా ఉంది. ఆ మాతల బిడ్డలను మీకిస్తాను. మీరు వారిని రక్షించండి. మిమ్మల్ని అందరు సజ్జనులు నమస్కరిస్తారు." అందుకు మాతృకలు అంగీకరించాయి. అవి కుమారస్వామితో కలసి జీవించాలని కోరుకున్నాయి.

కుమారస్వామి వారితో యిలా అన్నాడు. "మాతలారా! పదహారు సంవత్సరాలు వచ్చేవఱకు పిల్లలను రకరకాలైన రూపాలతో బాధించండి. నానుండి ఒక భయంకరమైన అంశను మీకిస్తున్నాను. ఆఅంశతో కలసి మీరు సుఖంగా ప్రజలచే పూజింబడుతూ జీవించండి."

తరువాత స్కందుని శరీరంనుండి బంగారంలా వెలుగుతున్న మనుష్యుడు ప్రజలను బాధించడానికి బయటకు వచ్చాడు. అతడు ఆకలితో స్పృహలేకుండా భూమిపై పడ్డాడు. కుమారుని ఆజ్ఞతో అతడు రౌద్రరూపం

ధరించాడు. అతని పేరు స్కందాపస్మార గ్రహము. వినతయే శకుని గ్రహము. పూతనయనే రాక్షసియే పూతనాగ్రహము. భయంకరరూపంతో ఉన్న పిశాచి శీతపూతన. ఈమె గర్భంనుండే పిల్లల్ని అపహరిస్తుంది. అదితియే రేవతి. ఆమె కుమారుడు రైవతుడు. ఇతడు పిల్లలను బాధిస్తాడు. రాక్షసుల తల్లియైన దితి ముఖమండిక. ఈమె పిల్లలమాంసం తిని సంతోషపడుతుంది. కుమారస్వామి శరీరంనుండి పుట్టిన బాలురు, బాలికలు గర్భాన్ని బాధించేవి. పిల్లలకు కష్టాలనిచ్చేవి. ఈ కుమారికల భర్తలే బాలకులకు నాశాన్నియిస్తారు. గోమాత అయిన సురభిపై శకునిఎక్కి పిల్లలను తింటుంది. కుక్కలతల్లిఅయిన సరమ గర్భస్రావాలను కలిగిస్తుంది. గంజాయి లేక ఉల్లిచెట్టుపై వృక్షాలతల్లి ఉంటుంది. అందుకే సంతానంకోరేవారు ఈమెను నమస్కరిస్తారు. ఇవికాక 18 గ్రహాలున్నాయి. వీటికి మాంసం, మద్యం అంటే చాలా యిష్టం. ఇవి 7 రోజులవఱకు పురిటింట్లో ఉంటాయి. కద్రువు సూక్ష్మరూపంతో గర్భిణిలో ప్రవేశిస్తే ఆమె గర్భాన్ని తింటుంది. గర్భవతి పామును ప్రసవిస్తుంది. ఒకసారి గంధర్వుల తల్లి గర్భం తీసుకొని వెళ్లిపోతుంది. అప్పుడు స్త్రీగర్భం లేకుండా లోకంలో తిరుగుతుంది. అప్సరసల తల్లికూడ గర్భాన్ని అపహరిస్తుంది. అయితే గర్భంపోయిందని ప్రజలు భావిస్తారు

ఒక స్త్రీ ఎఱ్ఱని సముద్రంనుండి పుట్టింది. ఈమె స్వామికి పాలిచ్చి పెంచింది. ఈమె పేరు లోహితాయని. ఈమెను కడిమిచెట్టుపై పూజిస్తారు. పురుషులలో శివుడు ఎలాంటివాడో స్త్రీలలో పార్వతి అలాంటిది. అనేక కోరికలకై ఈమెను పూజించవచ్చు. ఈ గ్రహాలన్నీ పిల్లలకు పదహారు సంవత్సరాలు వచ్చేదాకా బాధిస్తాయి. పురుషులుగాని స్త్రీలుగాని యివన్నీ స్కందగ్రహాలే.

ఈ గ్రహాలన్నింటికీ స్నానంచేయించి ధూపదీపాలివ్వాలి. కార్తికేయుని పేరుతో వీటికి బలియివ్వాలి. ఇలాచేస్తే ఈ గ్రహాలన్నీ శాంతించి పిల్లలకు శాంతినిస్తాయి. ఆయుర్దాయాన్ని పరాక్రమాన్నిస్తాయి.

పదహారు సంవత్సరాల తరువాతకూడ గ్రహాలుబాధిస్తాయి మెలకువతో గాని, నిద్రలోగాని దేవతలను తఱచుచూసే వ్యక్తికి దేవగ్రహం పట్టిందని గ్రహించాలి. ఇలాగే మరణించినవారిని చూడడం పిచ్చి. ఇది పితృగ్రహం

వలన కలుగుతుంది సిద్ధులను తిరస్కరిస్తే వారు శపిస్తారు. అతనికి ఉన్మాదం కలుగుతుంది. దీనిని సిద్ధగ్రహపీడ అంటారు. రాక్షసగ్రహం పట్టినవ్యక్తి వస్తువులు లేకపోయినా రకరకాలైన వాసనలను, రుచులను పొందుతాడు. గంధర్వులు కనుక మనుష్యుల శరీరంలో ప్రవేశిస్తే పిచ్చి ఎక్కుతుంది. కాలం వ్యతిరేకించి యక్షులు ప్రవేశిస్తే పిచ్చి ఎక్కుతుంది. ఇది యక్షగ్రహ పీడ. పిశాచంఎక్కినా ఉన్మాదం కలుగుతుంది. ఇది పిశాచగ్రహబాధ. వాత, పైత్య, కఫాల ప్రభావంవలన ఉన్మాదం కలిగితే వైద్యశాస్త్రం ప్రకారం చికిత్సచేయాలి. మనోవికలతవలన, భయంకరదృశ్యాలు చూడడంవలన ఉన్మాదంకలిగితే అతని మనస్సుకు శాంతి కలిగించాలి. గ్రహపీడలవలన ఎప్పుడూ ఆడుకోవాలనే కోరికగాని, కామంగాని కలుగవచ్చును. 70 సంవత్సరాలవఱకు ఈ గ్రహాలు పీడిస్తాయి. ఆ తరువాత గ్రహపీడతో సమానమైన అనారోగ్యాలు కలుగుతాయి.

ఇంద్రియనిగ్రహం, దమము, శుద్ధత, సోమరితనం లేకుండుట, ఆస్తికత్వము మొ॥ లక్షణాలున్న వ్యక్తులవద్దకు ఈ గ్రహాలురావు. శివభక్తులను ఈ గ్రహాలు బాధించవు.

## స్వాహా - అగ్నిలకు నిత్యసంబంధము

స్వాహాదేవి దక్షప్రజాపతి కూతురు. ఈమెకు బాల్యంనుండి అగ్ని అంటే ప్రీతి. 'అగ్ని తనను సరిగా గుర్తించలేద'ని కుమారస్వామితో విన్నవించుకోగా బ్రాహ్మణులు హవ్యకవ్యాలను స్వాహా అని నీపేరు చెబుతూ హోమం చేస్తారని' కనుక నీకు అగ్నితో నిత్యసంబంధం ఉంటుందని కుమారస్వామి వరమిచ్చాడు. తరువాత స్వాహాదేవి అగ్నితో కలసి స్వామిని పూజించింది.

శివతేజస్సు అస్తపర్వతంపై పడగా మింజిక, మింజికుడు అనే స్త్రీ పురుషులు అక్కడినుండి జన్మించారు. లోహిత సముద్రంలో, సూర్యరశ్మిలో, భూమిమీద, చెట్లపైన శివతేజస్సు ఐదురకాలుగా పడింది. అక్కడినుండి క్రూరులు. మాంసాహారులైన గణాలు పుట్టాయి. ఇవి శివవరంవలన కుమారస్వామిని అనుసరించి ఉంటాయి.

ధనంకావాలని కోరేవారు ఈ గణాలను మందారపువ్వులతో పూజించాలి. రోగశాంతిని కోరేవారు సామాన్యపూజ గణాలకు చేయాలి. పిల్లలక్షేమం కోరేవారు మింజికను, మిజికుడిని నమస్కరించాలి. మనుష్య మాంసంతింటూ వృద్ధికలు అనే స్త్రీలు చెట్లపై ఉంటారు. సంతానంకోరేవారు వీరికి నమస్కరించాలి. ఇలా పిశాచగణాలు చాలా ఉన్నాయి.

## కుమారుని ఆటవస్తువులు

ఐరావతగజానికి వైజయన్తి అనే రెండు గంటలున్నాయి. ఇంద్రుడు వాటిని కుమారస్వామికిచ్చాడు. విశాఖుని గంటపేరు లోహిత. కుమారస్వామి గంట పతాక. దేవతలందరు స్వామికి ఆటవస్తువులనిచ్చారు.

సంతానవృక్షాలు, వికసించిన గన్నేరుచెట్లు, పారిజాతము, జపా పుష్పము, అశోకములు, కడిమిచెట్ల గుబురులు, దివ్యమృగములు, దివ్య పక్షులు, దేవగణాలు, పిశాచగణాలు, ఋషులు, గంధర్వులు, అప్సరసలతో ప్రకాశించే శ్వేతపర్వతంపైగల స్వామిని ఎంత దర్శించినా తృప్తి ఉండదు.

దేవతలందరితో కలసి పార్వతిని వెంటబెట్టుకుని శివుడు మంగళకరమైన మఱ్ఱిచెట్టువద్దకు రథంఎక్కి వెళ్లాడు. ఆరథానికి వేయి సింహాలున్నాయి. శివుడు అక్కడకు వచ్చిన కుమారస్వామిని చూచి ఏడవమారుతస్కంధాన్ని రక్షించ మని చెప్పగా, స్వామి అలాగే రక్షిస్తున్నాడు. అవసరంవచ్చినపుడు దేవతలను రక్షిస్తుంటాడు స్వామి.

కుమారస్వామి అక్కడినుండి వెళ్లాక రాక్షసులు కేకలతో ఆయుధాలతో అక్కడికివచ్చి దేవతలతో యుద్ధానికి సిద్ధమయ్యారు. దేవదానవయుద్ధం భయంకరంగా సాగింది. ఆయుద్ధంలో మహిషాసురుడు కొండపట్టుకొని తీవ్రంగా యుద్ధం చేయసాగాడు. శివుని రథంవద్దకు వచ్చి రథానికిఉన్న యిరుసులాగాడు, అయినా శివుడు మహిషుడిని చంపక స్కందుడిని స్మరించాడు.

వెంటనే ఎఱ్ఱని వస్త్రాలు, ఎఱ్ఱని పూలదండలు, బంగారుకవచం ధరించి ఎఱ్ఱబారిన ముఖంతో కుమారస్వామి ప్రత్యక్షమై మండుతున్న శక్తిని ప్రయోగించి మహిషుడిని చంపాడు. స్కందుని పరిచారకులు రాక్షసులను

చంపి రక్తంత్రాగి పరవశించారు ఇంద్రుడువచ్చి స్వామి అజేయుడని కీర్తించాడు. శివుడు తనలాగే కుమారుని పూజించాలని దేవతలతో చెప్పాడు.

స్కందుని జన్మను, లీలలను చదివినవారు సంతోషంపొంది స్కందుని అనుగ్రహం పొందుతారు.

ఆంధ్రభారతంలో దీనిఫలశ్రుతి చూడండి ;—

"ఒక్కదినంబునందు బలియుండు సురారులనెల్లఁ దున్మి పెం
పెక్కఁదియార్దుగ్రడై యభయమిచ్చె జగంబులకెల్ల షణ్ముఖుం
డిక్కథ భక్తితో వినినవెప్పుడుఁ గొర్తనసేసినన్ జనుల్
నిక్కము సర్వదోషములనీఁగి భజింతురు సర్వభద్రముల్"

## కార్తికేయోత్పత్తి

శివపార్వతులవద్దకు దేవతలు పంపగా అగ్నిదేవుడు భిక్షాటనం చేస్తూ వచ్చి భిక్ష అడిగాడు. శివుడు తన తేజస్సును అగ్నికియిచ్చాడు. అగ్ని దానిని గ్రహించి దేవతలవద్దకు వచ్చాడు. అగ్ని తేజస్సుధరించడం వలన దేవతలు కూడా తేజస్సును ధరించినవారయ్యారు. వారు భరించలేకపోతే శివుడు వారి తేజస్సులను కక్కమని చెప్పగా వారు అలాగే వమనం చేసారు. బంగారంలా మెరుస్తూ ఆతేజస్సు పర్వతంలాగా వెలిగింది. శివానుజ్ఞపై అగ్ని నెలనెలా తపించేవారి శరీరంలో తన తేజస్సును ఉంచసాగాడు.

ఇదిలా ఉండగా ఉదయం స్నానానికై వచ్చిన సప్తఋుర్షుల భార్యలు చలి తగ్గడానికి అగ్నివద్దకు వచ్చారు. అరుంధతి వద్దనిచెప్పినా వారు వినలేదు. అరుంధతిమాత్రం రాలేదు. అలా చలికాచుకుంటున్న సప్తర్షుల భార్యల రోమకూపాలలో అగ్నిధరించిన శివతేజస్సుయొక్క పరమాణువులు చేరాయి. వారు హిమాలయపర్వతంపై ఆ తేజస్సులను ఉంచగా గంగానదీ తీరంలోని ఇసుకతిన్నెలపై ఆఱుముఖాలతో బాలుడు జన్మించాడు. శివపార్వతులు ఆబాలుడిని లాలించి పెంచారు.

అగ్నిదేవుడు పావురంగామారి శివపార్వతులవద్దకు వచ్చినట్లు స్కాందం లోని మఱియొక సందర్భంలో చెప్పబడింది. అగ్నితనకు కలిగినవ్యామోహాన్ని గుర్తించి మరణించాలనుకున్నాడు. కాని ఆకాశవాణి వలదనివారించింది.

ఇంద్రుడు వజ్రాయుధంతో మొదటిసారి కొట్టినప్పుడు విశాఖుడు హృదయంలో రెండవసారి కొట్టినపుడు నైగమేయుడు జన్మించారని స్కాంద పురాణం చెబుతూంది.

కుమారస్వామి తారకాసురుడిని చంపాక బలపుత్రుడైన బాణాసురుడు క్రౌంచపర్వతాన్ని ఎత్తికొడుతూ దేవతలను బాధింపసాగాడు. కుమారస్వామి రావడం చూచి క్రౌంచపర్వతంలో దిగాడు. అది గ్రహించిన కుమారస్వామి శక్తితో ఆపర్వతాన్ని, బాణుడిని భేదించాడు. బాణుడు మృతుడయ్యాడు. క్రౌంచాద్రికి రంధ్రం ఏర్పడి, దాని ద్వారా హంసలు మానససరోవరానికి వెళ్లే స్రోవఏర్పడింది.

తారకుడు శివభక్తుడైనందువలన శివభక్తుడైన వానిని చంపిన పాపం పోవడానికి విష్ణువు ఆదేశంపై కుమారస్వామి పశ్చిమం, ఆగ్నేయం, ఉత్తర భాగాలలో మూడు శివలింగాలను స్థాపించి పంచామృతాలతో అభిషేకించి తారకునికి తర్పణాలిచ్చాడు. శివుడు కృష్ణచతుర్దశినాడు చైత్రమాసంలో ఈ కపాలేశ్వరస్థానంలో పూజించినవానికి పాపాలు పోతాయని అనుగ్రహించాడు.

అసలు కృత్తికలు చాతుర్మాస్యసమయంలో ఆకాశగంగలో స్నానం చేయడానికి వచ్చిన షట్కృత్తికలు కుమారస్వామిని పెంచారు. ప్లక్షద్వీప సమీపంలో క్షీరసముద్రం మధ్యలో శ్వేతద్వీపం ఉంది. అక్కడ ప్రయాణిస్తున్న శివుడు పార్వతికి చెప్పిన రహస్యాలను కుమారస్వామి విన్నాడని బ్రహ్మఖండం చెబుతూంది.

## కుమారస్వామి జ్ఞాననిష్ఠ

తారకుడిని చంపాక కుమారస్వామిని వివాహం చేసుకోమని శివపార్వతులు ప్రేరేపించారు. కాని స్త్రీలందరిని పార్వతులుగాను, పురుషులనందరినీ శివుళ్లుగాను చూస్తున్నానని, వారలా కనిపిస్తున్నారని చెప్పి, తను మహాజ్ఞానం పొందడానికి క్రౌంచపర్వతం వద్దకువెళ్లి, అక్కడ ఆశ్రమం నిర్మించుకుని తీవ్రమైన తపస్సుచేసాడు. అణిమాద్యష్టసిద్ధులు స్వామివద్దకు రాగా కోరికలు లేని నాకు ఇవి ఎందుకని ఉపేక్షించాడు లోకానుగ్రహంకోసం చివరకు వాటినిపొంది బ్రహ్మస్వరూపుడై ప్రకాశించాడు. అనికూడ బ్రహ్మఖండంలో వ్యాసుడు చెబుతున్నాడు.

### వల్లీదేవి ఎవరు?

వల్లీదేవి పుళిందరాజుయొక్క కూతురు. ఈమెను కూడ కుమారస్వామి వివాహమాడాడు.

## కుమారస్వామి మహిమలు

ఆఱుగురి మునిపత్నుల రూపంధరించిన స్వాహాదేవికి జన్మించడం వలన, షట్కృత్తికల పాలుత్రాగడంవలన కుమారస్వామికి ఆఱుముఖాలేర్పడినాయి. అందుకే ఇతడు షణ్ముఖుడు, షడాననుడు అయ్యాడు.

శివతేజస్సు స్రవించడంవలన జన్మించాడు గనుక యితడు స్కందుడని పిలువబడుతున్నాడు. తెల్లుతోటలో ఉండడంవలన శరవణభవుడయ్యాడు. అగ్నిని, స్వాహాదేవిని ఆవేశించిన శివపార్వతులు కుమారస్వామినికన్నారు. ఇది రహస్యము.

ఋషిపత్నులు అగ్నిని చేరిరను వదంతి వ్యాపించింది. అప్పుడు ఋషిపత్నులు తమనింద పోగొట్టుకోవడానికి కుమారస్వామి వద్దకు వచ్చారు. కుమారుడు ఆ మునిపత్నులను ఒక నక్షత్రముగాచేసి అగ్నిని అధిష్ఠాన దేవతగా చేసాడు. స్వాహాదేవి మునులవద్దకు వెళ్లి తానే వారివేషం ధరించిన విషయంతెలిపి శంకను పోగొట్టింది.

కుమారస్వామి శివుని విల్లుకుగల త్రాడునులాగి చప్పుడు చేసాడు. అప్పుడు అష్టగజాలలో రెండుఏనుగులు కుమారస్వామిమీద పడ్డాయి. ఆరెండు ఏనుగులను పట్టుకొని ఆడుకున్నాడు.

ఇంద్రుడు తన వాహనమైన ఐరావతానికి ఉన్న రెండుగంటలను బహూకరించాడు. కుమారస్వామి తను ఒక గంటను తీసికొని రెండవదానిని తన అవతారమైన విశాఖునకిచ్చాడు.

కుమారస్వామి ఆడుకుంటుండగా శివపార్వతులు, దేవతలు అతడివద్దకు వచ్చి ఎవరివద్దకు వస్తాడా అని ఎదురుచూడసాగారు. అప్పుడు కుమారస్వామి అనేకరూపాలతో అందరివద్దకు వచ్చి వారికి ఆశ్చర్యం కలిగించాడు. ఇతని ప్రభావం గుర్తించిన దేవతలు అతనికి సేనాధిపత్యం యిచ్చారు.

కుమారస్వామి శివునికి ఓంకార రహస్యం బోధించాడనే గాథ తమిళదేశంలో ప్రచారంలో ఉంది

కుమారస్వామి మునులకు రేణుకాదేవి మహిమను, శ్రీ రేణుకాతత్త్వాన్ని బోధించినవారిని జ్ఞానోన్ముఖులను చేసాడు. మామిడిపండుకోసం వెళ్లి తీయ మామిడిపండ్లచెట్టువద్ద ఉన్న స్కందునిచూచి, శివుడు స్వయంగా మామిడి పండు నిచ్చాడు. శివునికిగూడ జ్ఞానబోధ చేసాడు స్కందస్వామి.

## కుమారస్వామి అవతారాలు

ఒకప్పుడు కుమారస్వామి బ్రహ్మనుచూచి ఓంకారముయొక్క అర్థమేమని అడిగాడు. నేనే ఓంకారస్వరూపాన్ని అన్నాడు బ్రహ్మ. అప్పుడు కోపగించిన కుమారస్వామి బ్రహ్మను బంధించాడు. ఇంద్రుడు మొ॥ దేవతలు శివునితో చెప్పుకున్నారు. బ్రహ్మను విడచి పెట్టమని శివుడు నందీశ్వరుని ద్వారా సందేశంపంపి తాను కూడ కుమారస్వామితో చెప్పాడు. అప్పుడు కుమారుడు బ్రహ్మను విడచి పెట్టాడు. శివభక్తిని లోకంలో వ్యాపింపజేయడానికి మానవుడిగా పుట్టమని కుమారస్వామితో చెప్పాడు శివుడు. ఇతడేచెన్నబసవుడిగా జన్మించాడని కొందరి అభిప్రాయం.

పూర్వమీమాంసాశాస్త్రాన్ని వ్యాపింపజేయడానికి కుమార స్వామియే కుమారిలభట్టుగా జన్మించాడని చెబుతారు పెద్దలు. ఇతడు చంద్రగుణా - యోగీశ్వరభట్టులను బ్రాహ్మణదంపతులకు మహానదీప్రాంతం లోని జయమంగళగ్రామంలో జన్మించాడు ఇతడు జైనమత, బౌద్ధమతాలను క్షుణ్ణంగా చదివి వాటిని ఖండించి పూర్వమీమాంసా సూత్రములకు తంత్ర వార్తికమను భాష్యమును రచించెను. ప్రభాకరభట్టు మొ॥ మహాపండితులు ఇతని శిష్యులు.

## కుమారస్వామి [illegible]

ఆ పరాశక్తియొక్క భాగమే కుమారస్వామి. అందుకే ఆశక్తి నెమలి వాహనంపై అధిరోహించి కౌమారి అనే పేరుతో పిలువబడుతుంది అని సప్తశతి.

"సర్వేషామేవ తత్త్వానాం యఃపరః పురుషః స్మృతః
తస్మాదవ్యక్తముత్పన్నం తత్త్వాది త్రివిధం తు తత్
పురుషావ్యక్తయోర్మధ్యే మహత్త్వం సమపద్యత
సచాహంకార ఇత్యుక్తః యోమహాన్ సముదాహృతః
పురుషో విష్ణురిత్యుక్తః శివో వా నామతః స్మృతః
అవ్యక్తం తు ఉమాదేవీ శ్రీర్వా పద్మనిభేక్షణా
తత్సం యోగాదహఙ్కారః సచ సేనాపతిర్గుహః"
—వరాహ. 25 అ. 2 - 4½ శ్లో.

సుబ్రహ్మణ్యేశ్వరస్వామి బ్రహ్మచారిగా, కుమారస్వామిగా ఆరాధింపబడు తున్నాడు. దక్షిణదేశంలో కుమారస్వామి దేవాలయాలు ఎక్కువ. మురుగన్ అని ఈయనను తమిళులు పిలుస్తారు.

ఈదేవుడు అన్ని విద్యలకు మూలము. యుద్ధవిద్యకు ప్రధానదేవత. దేశరక్షణకు, విజయానికి పెట్టిందిపేరు. ఈయనను అరాధించడం వలన దేశ క్షేమము కలుగుతుంది. అన్నిపనులు అద్భుతముగా నెరవేరును.

దేవతలందరిలోకి ఈయన సాక్షాత్తుగా పరబ్రహ్మమే. అందుకే శ్రీకృష్ణుడు భగవద్గీతలో నేను స్కందుడిని అని ప్రత్యేకించి చెప్పాడు.

పూర్వం ఎవరైతే అన్ని పుణ్యనదులలోను తీర్థమాడి త్వరగా వస్తారో వారికే గణాలకు ఆధిపత్యాన్ని యిస్తాడని శంకరుడు చెప్పాడు. అపుడు కుమారస్వామి నెమలివాహనం ఎక్కి అతివేగంగా అన్ని నదులతో స్నానం చేసి వచ్చాడు. కాని ప్రతినదిలో స్నానంచేసి వస్తూండగా తనకంటె ముందుగా విఘ్నేశ్వరుడే స్నానంచేసి వస్తున్నట్లు కన్పించాడు. గణపతి వేగంగా నడువలేని వాడైనా తల్లిదండ్రులయిన పార్వతీపరమేశ్వరులకు భక్తిపూర్వకంగా ప్రదక్షిణం చేసాడు. ఆమహిమవలన అలా కన్పించాడు కుమారస్వామి తన కంటె ముందుగా స్నానంచేసి తల్లిదండ్రులవద్దనున్న గణపతిని చూచి తన అన్నగారైన గణపతి మహిమను కొనియాడి గణాధిపత్యానికి అతడినే అంగీక రించాడు. పెద్దల మహిమ గుర్తింపగలవాడు శ్రీకుమారస్వామియని తెలు స్తూంది.

# కుమారస్వామి ఎలా ప్రసన్నుడౌతాడు?

కుమారస్వామి మహాదేవుడు. అన్నిపాపాలు పోగొట్టేవాడు. ఇతనికి షష్టితిథి చాలా యిష్టం. ఇతనికి షష్టినాడు అభిషేకం చేయాలని బ్రహ్మదేవుడు చెప్పాడు. ఈరోజు కేవలం పళ్లుమాత్రం తిని, ఇంద్రియాలను నిగ్రహించి, శ్రద్ధతో పూజిస్తే సంతానం లేనివారికి సంతానం కలుగుతుంది. ధనం కావాలనుకునే వారికి ధనం లభిస్తుంది. ఏకోరికతోపూజిస్తే ఆకోరిక నెఱవేరు తుంది. కార్తికేయునిస్తోత్రం చదివినవారి సంతానానికి క్షేమము, ఆరోగ్యము కలుగుతాయి.

కార్తికపూర్ణిమకు కృత్తికాయోగమున్నపుడు కుమారస్వామిని దర్శించి నచో ఏడుజన్మలయందు ధనవంతుడైన విప్రుడుగా పుట్టును. వేదపారంగతు డగును. కార్తీకపూర్ణిమనాడు కుమారస్వామినిచూస్తే ఆయన అనుగ్రహిస్తాడు.

మాఘమాసంలో శుక్లపక్షంలో కుమారస్వామిని (స్కందుని) పూజిస్తే అన్నిగుణాలు కలుగుతాయని షణ్ముఖోల్లాస స్తోత్రం చెబుతుంది.

## మహాకవుల కావ్యాలలో కుమారస్వామి ప్రసక్తి

కాళిదాసు కుమారస్వామి యుత్పత్తిని గూర్చి, తారకాసురునితో యుద్ధాన్నివర్ణిస్తూ 'కుమారసంభవమ్' అనే కావ్యాన్ని రచించాడు. తారకాసుర యుద్ధఘట్టం కాళిదాసుది కాదని, పుట్టుకవఱకే అనగా 8 సర్గల వఱకే కాళిదాసు కృతమంటారు పెద్దలు. రఘువంశ మేఘసందేశకావ్యాలలో కుమారస్వామిని స్మరించటం జరిగింది! ధూర్జటి వ్రాసిన శ్రీకాళహస్తి మాహాత్మ్యమునందు సుబ్రహ్మణ్యుని భక్తరక్షణ వర్ణించబడింది. శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రిగారు 'సుబ్రహ్మణ్యేశ్వరీయము' అనే కావ్యం వ్రాసారు. వల్లీ కల్యాణగాథ కావ్యరూపం దాల్చింది.

ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారు 'కుమారభారతి' అనే పేరుతో కుమారస్వామి దేవసేనాధ్యక్షుడైన గాథ గ్రహించి తెలుగులో చక్కని కావ్యం రచించారు.

ప్రథమాధ్యాయము సమాప్తము

) —o— (



## ద్వితీయాధ్యాయము

# శ్రీ సుబ్రహ్మణ్యాననము

## శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి

శ్రీ సుబ్రహ్మణ్యుడు నాగేంద్రుడుకాడని కొంతమంది 'నాగపూజ' గ్రంథంలో వివరించడం జరిగింది. లోకంలో ఒకటేయనే ప్రతీతి ఉన్నది.

స్వీయాభిప్రాయము :

సుబ్రహ్మణ్యుడు, నాగేంద్రస్వామి, కుమారస్వామి ఒకటే. కుమారస్వామి నాగేంద్రుడుగా అవతరించాడనే పురాణగాథను లోగడ యీగ్రంథంలో వివరించడం జరిగింది. బ్రహ్మశ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రిగారు (శతావధాని) సుబ్రహ్మణ్యుడే నాగేంద్రుడని వర్ణించారు.[1] ఈ సుబ్రహ్మణ్యేశ్వరస్వామియే భూభారాన్ని తలపైమోస్తూ ఆదిశేషుడిగా కీర్తింపబడుచున్నాడు. దేవేంద్రాదులు ప్రార్థింపగా లక్ష్మణుడై శ్రీరాముని సేవించినాడు.[2] ఈ సుబ్రహ్మణ్యుడే సర్వజీవుల యంతరాత్మయై సర్వరూపమునుదాల్చి ప్రపంచమును పాలించుచున్నాడని వర్ణింపబడినది. ఇంతేగాక బిక్కవోలుపురంలో అవతరించియున్నాడు.[3] కావున సుబ్రహ్మణ్యుడు, కుమారస్వామి, నాగేంద్రుడు ఒకే

---

1) "విషజ్వాలాకరాళ దంష్ట్రి ధగద్ధగాయమాన ఫణామండల విరాజమాన ఫణిరాజ, స్వరూపముందాల్చి- సుబ్రహ్మణ్యేశ్వరుండు" —సుబ్రహ్మణ్యేశ్వరీయము. P.17

2) "ఎవడు దేవేంద్రాదు వెలమి ప్రార్థింప
క్ష్మణదేవుడై రాముగలసి నాడో" — ,, P. 18

3) "ఆతడప్రతిముండు మహానుభావు
డఖిలరూపుండు సర్వజీవాంతరాత్మ
సర్వరూపంబు దాల్చి విశ్వంబుబ్రోవ
నవని శ్రీ బిక్కవోలులోన నవతరించె" — ,, P. 20

దేవుని రూపాంతరాలని భావించవచ్చును. సుబ్రహ్మణ్య సహస్రనామాలలో గూడ ఈ భావం గోచరిస్తుంది.

మార్గశిరమాసము శుద్ధషష్టినాడు సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని సేవించిన వారి కోరికలు తీరును.

"మార్గశీర్షమనెడు మాసమ్మునందున
శుద్ధషష్టియందు శుద్ధమైన
మానసంబుతోడ వానిని సేవింప
మీదుకోర్కిదీరు నీధరిత్రి"

## సుబ్రహ్మణ్య మన్త్రియన్త్రములు

అస్యశ్రీ సుబ్రహ్మణ్యేశ్వర మహామన్త్రస్య సదాశివః ఋషిః అనుష్టుప్ ఛందః. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరో దేవతా. హ్రాం బీజం, హ్రీం శక్తిః హ్రూం కీలకమ్. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరప్రసాదసిధ్యర్థే ఇష్టకామ్యార్థసిద్ధ్యర్థే సకల స్త్రీపురుష రాజవశీకరణార్థే జపే వినియోగః

| కరన్యాసః | అంగన్యాసః |
|---|---|
| హ్రాం అంగుష్ఠాభ్యాం నమః | హ్రాం హృదయాయ నమః |
| హ్రీం తర్జనీభ్యాం నమః | హ్రీం శిరసే స్వాహా |
| హ్రూం మధ్యమాభ్యాం నమః | హ్రూం శిఖాయై వషట్ |
| హ్రైం అనామికాభ్యాం నమః | హ్రైం కవచాయ హుమ్ |
| హ్రౌం కనిష్ఠికాభ్యాం నమః | హ్రౌం నేత్రత్రయాయ వౌషట్ |
| హ్రః కరతలకరపృష్ఠాభ్యాం నమః | హ్రః అస్త్రాయ ఫట్ |

—భూర్భువస్సువరోమితి దిగ్బంధః

### ధ్యానమ్

శ్లో॥ గాంగేయం వహ్నిగర్భం శరవణజనితం జ్ఞానశక్తిం కుమారమ్
బ్రహ్మణ్యం స్కందదేవం గుహమమలగుణం రుద్రతేజస్స్వరూపమ్
సేనాన్యం తారకఘ్నం గురుమచలమతిం కార్తికేయం షడాస్యమ్
సుబ్రహ్మణ్యం మయూరధ్వజరథసహితం దేవదేవం నమామి.

## పంచపూజా

శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః గంధం సమర్పయామి
శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః పుష్పాణి సమర్పయామి
శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః ధూపమాఘ్రాపయామి
శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః దీపం దర్శయామి
శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః నైవేద్యం నివేదయామి

## మూలమన్త్రము

1) "ఓం హ్రీం సాం శరవణభవ సాం హ్రీం ఓం"
2) సుబ్రహ్మణ్యగాయత్రి ;
**"తత్పురుషాయ విద్మహే మహాసేనాయ ధీమహి**
**తన్నః షణ్ముఖః ప్రచోదయాత్"**

ఈ మంత్రమును ప్రతిదినము 1008 గాని, 108 గాని జపించి మరల కరన్యాస అంగన్యాసములను దిగ్విమోకమును ధ్యానమ్ము, పంచ పూజలను చేయవలయును. ఇట్లు జపించువారు ఆయురారోగ్యశ్వంతానసౌఖ్యము లను ఐశ్వర్యమును భగవదనుగ్రహమును పొందుదురు.

---

సూచన : ఏమంత్రమునైనను తన్మంత్రోపాసనగల్గు గురువునుండి యథావిధిగ ఉపదేశమునుపొంది మంచినడవడి కలిగి జపించిననే ఫలించును. పుస్తకములను చూచి జపింపరాదు. అట్లుచేసిన చెడుఫలములు ప్రాప్తించును.

---

## సుబ్రహ్మణ్యస్వామి

సుబ్రహ్మణ్యస్వామి - స్కందుడు - మురుగన్-కుమారస్వామి అందరూ ఒకటే. స్కాందపురాణాన్ని స్కందుడు అనగా సుబ్రహ్మణ్యుడే చెప్పాడు. తొల్కాప్పియం అనే తమిళ ప్రాచీనగ్రంథం సుబ్రహ్మణ్యుడు పర్వత ప్రాంతాలకు దైవమని చెబుతూంది. నెమలిపై కుమారస్వామి ఆతని వెనుక ఉదయించే సూర్యుడిని తిరుమురుగర్రుప్పడై అనే కావ్యంలో నక్కీరుడు వర్ణించాడు. ఇందులోని రహస్యం ఏమిటంటే సూర్యోదయకాలంలో సముద్రపుగాలి అధిక ఆక్సిజన్ను, ఓజోన్ను కలిగియుండి అనేకవ్యాధులను

తగ్గిస్తుంది. కుమారస్వామి అట్టి సూర్యశక్తితోకూడి తన భక్తులనను గ్రహిస్తాడు.[1]

కుమారస్వామి అగస్త్యునకు శ్రీవిద్యారహస్యములను, తమిళభాషను బోధించెను. మురుగశబ్దానికి దివ్యపరిమళము - మాధుర్యము మొ॥ అనేక అర్థాలున్నాయి. కుమారస్వామికి గల ముఖ్యమైన మూర్తులు ఇవి.

1) జ్ఞానశక్తిధర 2) స్కందస్వామి 3) దేవసేనాపతి 4) సుబ్రహ్మణ్య 5) గజవాహన 6) శరవణభవ 7) కార్తికేయ 8) కుమార 9) షణ్ముఖ 10) తారకాంతక 11) సేనాపతి 12) బ్రహ్మశాస్త 13) వల్లీకల్యాణ సుందర 14) బాలసుబ్రహ్మణ్య 15) క్రౌంచభేదన 16) శిఖివాహన

కుమారతన్త్రము, శ్రీతత్త్వనిధి గ్రంథాలు ఇంకా 1) అగ్నిజాత 2) సౌరభేయ 3) గాంగేయ 4) గుహ 5) బ్రహ్మచారి. అనేరూపాలు కూడ ఉన్నాయని చెబుతున్నాయి.

సేనానాయకులతో స్కందుడు తానేనని శ్రీకృష్ణుడు చెబుతున్నాడు వాల్మీకి - వ్యాస - కాళిదాసాదులేగాక నన్నయాది తెలుగుకవులు, నక్కీరర్, అరుణగిరినాథర్, కుమారగురుపరార్, కాచియప్ప శివచరియర్, రామలింగ స్వామిగల్, పంబన్‌స్వామింగల్ మొ॥ తమిళకవులు స్వామిని కీర్తించారు.

సనత్కుమారుడే స్కందుడు. ఇతడు కుమారస్వామి అవతారం అని తెలుస్తోంది.[2]

## చారిత్రకంగా కుమారస్వామిపైగల భక్తి

పంజాబ్‌లో కొన్నిప్రాంతాలను BC 2వ శతాబ్దం, AC నాల్గవ శతాబ్దంలోనూ పాలించిన యౌధేయరాజులు తమ రాజ్యాన్ని సుబ్రహ్మణ్య స్వామికి అంకితంచేయడమే గాకుండా నాణెములపై కుమారస్వామిని చెక్కించి

---

1) "Breeze from the bay at the time of Sun-rise contains extra oxygen- oxone, and it cures many diseases. So also Muruga has an added element of grace which he confers on those who mediatate upon hin". – Sankar a and Shanmatha.

2) తస్మై మృదితకషాయాయ తమసః పారం దర్శయతి భగవాన్ సనత్కుమారః స్కంద ఇత్యాచక్షతే" - ఛాందోగ్య 7

భగవాన్‌స్వామి, బ్రహ్మణ్యకుమార అని, రాగినాణెములపై 'యౌధేయగానాస్య జయ' అని చెక్కించారు. మూడవ శతాబ్దంలోగల నాగార్జునకొండకు పాలకులు ఇక్ష్వాకులు కుమారస్వామిభక్తులై తమను 'స్వామి మహాసేనపతి ఘటీచ' అని వ్యవహరించుకున్నారు.

చాళుక్యరాజులుగూడ 'స్వామిమహాసేనపదానుధ్యాతినామ్' మొ॥ విధములుగా స్వామిపైగల తమ ప్రగాఢభక్తిని చాటుకున్నారు.[1]

## స్వామినామములు - వివరణ

1) శరవణభవ — తెల్లుతోటలో పుట్టినవాడు
2) స్కందుడు — శివతేజంనుండి వచ్చిన భాగాలన్ని ఒక చోట కూడి ఏర్పడినవాడు
3) కుమార — ఎల్లప్పుడు బాల్యావస్థలో గలవాడు.
4) గుహుడు —
5) షడానన — ఆరుముఖములు గలవాడు
6) అగ్నిభూః — అగ్నిదేవునివలన జన్మించినవాడు
7) సేనాని — దేవతల సేనలకు నాయకుడు.

## సుబ్రహ్మణ్యశబ్దమాహాత్మ్యము

సుబ్రహ్మణ్యుడు అనగా శోభనమైన అనగా సత్యముశివము సుందరము అయిన ఆ పరబ్రహ్మయందు ఎల్లప్పుడు శాశ్వతధ్యాననిష్ఠగలవాడని అర్థం. పరబ్రహ్మమే సుబ్రహ్మణ్యపదంచే వ్యవహరింపబడుతున్నదని తెలియు చున్నది.[2]

# శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి మహిమలు

## నత్కీరుని రక్షించుట

పూర్వం నత్కీరుడనే మహాకవి శివునితో పాషండవాదంచేసి శివునిచే శపించబడి కుష్ఠురోగం పొందాడు. అతడు పశ్చాత్తాపపడగా శివుడు కరుణించి కైలాసదర్శనంచేస్తే నీకు ఆరోగ్యం కలుగుతుందని చెప్పాడు. నత్కీరుడు

1) "Sankara and Sanmatha"

2) తలవకార బ్రాహ్మణమ్ - 6 పం - 1 అధ్యా.

అనేక తీర్థయాత్రలుచేస్తూ ఒక అడవిలో ఒక మఱ్ఱిచెట్టువద్ద విశ్రమించాడు. అక్కడికి ఒక భూతంవచ్చి నత్కీరుడిని పట్టుకొని ఒక గుహలోపడేసి గుహ ద్వారాన్ని ఒకబండరాయితో మూసింది. లోపల నత్కీరుడిలాగే చాలామంది బంధింపబడ్డారు. నూఱుమందిని కలిపి ఒకేసారి తినాలని భూతం ఆలోచన. నత్కీరునితో వందమంది పూర్తయ్యారు. వారందరూ విలపించారు. అప్పుడు నత్కీరుడు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని ఇలాస్తోత్రం చేసాడు.

1) "తారకదైత్యభంజనుడు దారుణశక్తిధరుండు పన్నగా
హారహయుండు దీనజనతామరభూజము షణ్ముఖాట్టహా
సారభటీ విపాటిత దిగంతకటాహుడు, వీనిబట్టి సంహార
మొనర్చి యిందఱ కృపాంబుధియై బ్రతికించుగావుతన్

2) భూతము జంపుటేయరుదు బోరన దారకుమన్ని గొన్నవి
ఖ్యాతమహాప్రతాపునకు నద్రిగుహాలయమేమి దొడ్డుని
ర్ఘాతమువంటి శక్తిగొని క్రౌంచము జించిన రౌద్రమూర్తికిన్
భీతిదొఱంగజేయుమొకపెద్దయె వారిత దేవతార్తికిన్"[1]

వెంటనే సుబ్రహ్మణ్యేశ్వరస్వామివచ్చి భూతాన్ని పడగొట్టి గుహద్వారం వద్దగల రాయిని తొలగించి వారందరినీ కాపాడాడు. ఈతని మహిమను చూడుడు—

"ఎబ్రహ్మజ్ఞులుగాని యేర్పడ సతంబేవాని కన్గొంట మా
కబ్రంబంచు దలంచి ధ్యానములు సేయంబూనికానంగలే
కేబ్రహ్మణ్యునికై పరిశ్రమములెన్నే బొందుచున్నారో యా
సుబ్రహ్మణ్యవిభుండనన్ సకలసంస్తుత్యుండు సామాన్యుడే."[2]

## విప్రగాథ

పూర్వము ఒక బ్రాహ్మణుండేవాడు. ఆతడన్నివిధములా తనకు తగిన స్త్రీని వివాహమాడెను. ఆ దంపతులన్యోన్యానురాగంతో సుఖించుచుచూ అనేక సంవత్సరములు గడిపిరి. కాని వారికనేకమంది సంతానంకలిగినా ఒక్కసుతుడు కూడా జీవించలేదు. వారెంతో విచారించుచుండిరి. వారి

---

1) శ్రీకాళహస్తిమహాత్మ్యము - 2వఆ. 207, 208ప.

2) సుబ్రహ్మణ్యేశ్వరీయము - P. 19

యింటికి వచ్చిన పెద్దలు, మహాత్ములు బిక్కవోలులో వెలసిన సుబ్రహ్మణ్యేశ్వరుని సేవింపుమని చెప్పిరి. వారిమాటపై యీదంపతులు కొన్నిదినములు పయనించి బిక్కవోలుచేరి స్వామిని పూజింపగా స్వామియనుగ్రహమున సంతానం కలిగింది. ఈ కుమారుడుగూడ బాల్యంలో రోగాదులనుదాటి యువకుడై ప్రకాశించుచు కమలాక్షియను స్త్రీని వివాహమాడి సుఖించెను. వారికి ఒక కుమారుడు కలిగెను. వానికి సుబ్రహ్మణ్యుడని నామకరణముచేసిరి. వృద్ధదంపతులు అది మొదలుకొని సుబ్రహ్మణ్యుని కులదైవంగా కొలుస్తూ సుఖింపసాగిరి.

## కలానిధిగాథ

పూర్వం కలానిధియనేవాడు అన్ని సుగుణములతో ప్రకాశించుచుండెను. అతనికొక గురువు లభించగా, అతనివద్ద విద్యాభ్యాసమును గావించుచుండెను. అతడు కలయను కన్నెను వలచెను. ఆమెను వివాహమాడు మార్గముగానక "వనితారత్నము గూర్పవోయికను సుబ్రహ్మణ్యదేవోత్తమా" అని సుబ్రహ్మణ్యుని ప్రార్థించెను. అంత దేవుడు ప్రత్యక్షమై వివాహము జరుగునట్లాశీర్వదించెను. వారు దంపతులై సుఖించిరి.

## మహామహుని గాథ

పూర్వం మహామహుడనే రాజు ధర్మాత్ముడై యుండెను. అతనిపై ఒక శత్రువు దండెత్తివచ్చెను. శక్తికొలదిపోరాడి మహామహుడు ఓడి భార్యాబిడ్డలతో అడవికేగెను. ఆకలితో యలమటించుచున్న రాజుకొక బ్రాహ్మణుడు కనుపించి సుబ్రహ్మణ్యుని సేవింపుమనిదెలిపి అంతర్ధానమొందెను. స్వామిని పూజింపుచు అడవిలో వెళ్లుచున్న రాజుకొక వ్యక్తి కనుపించెను. అతడు సుబ్రహ్మణ్యుని శక్తియను ఆయుధమే. ఆశక్తి ఈతనిని మూపుపైకెక్కించుకుని రాజమందిరమునకు వెళ్లి రక్షణాగారమునందుంచెను. పిమ్మట శక్తి రాజుపైకి దూకి యాతనినిచంపి మహామహునికి రాజ్యమిప్పించెను.

## కాంతకథ

పూర్వం సోముడనే వైశ్యుడుండేవాడు. అతడు న్యాయముగా వ్యాపారముచేయుచు పుణ్యమును చేయుచుండెను. అతడు కుమారునితో కలసి ఓడలపై యితర దేశములకువెళ్లి వ్యాపారముచేసి నావికునకు ఎంతో ధనమును బహూకరించి నావనెక్కెను. సముద్రమధ్యమున నావమునిగి,

నావికుడు మాత్రము బ్రతికి ఒడ్డుకుచేరెను. నావికుడు సాముని గ్రామముచేరి బంధువులకు, మిత్రులకు వార్తదెలుపగా వారెంతయో దుఃఖించిరి. అప్పుడు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వృద్ధబ్రాహ్మణ రూపమునవచ్చి, సహగమనము చేయబోవు అతని యిల్లాలిని రక్షించి బిక్కవోలునందలి సర్వరూపుడైన సుబ్రహ్మణ్యుని సేవింపుమని సెలవిచ్చెను. అందఱు బిక్కవోలుచేరి స్వామిని నియమనిష్ఠలతో సేవించి యింటికిరాగా సాముడు యాతని కుమారుడు అధిక లాభములతో గృహమునకరుదెంచియుండిరి. అందఱును సంతోషించుచూ భక్తితో శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని సేవించుచూ సుఖముగా కాలము గడిపిరి.

"అచ్చపుభక్తి నిం కననయంబునయంబున నాదిశేషునే
హెచ్చెచ్చుచులేక పూజల నపూర్వవిధిం బొనరింపగావలెన్"

"కలదా సర్వజనాభిరామ విలసత్కల్యాణ లక్ష్మీసమా
కవితప్రస్ఫురదస్మదీయ కవితాకన్యా పరిగ్రాహమో
గ్యలసద్గుణజాల సత్కులసువిద్యా సత్స్వరూపప్రధా
నిలయశ్రీ కవితుండు వేఱొకడు తండ్రీ నిన్ వినాయెందునన్"

—శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రికవి



# తృతీయాధ్యాయము

# నాగాననము

## నాగేంద్రుడు - సర్పములు

నాగేంద్రుడిని పూజించడం అనాదిగావస్తున్న మన ఆచారం. నాగేంద్రుడు సత్సంగాన్ని, సుఖదాంపత్యాన్ని శుభాలను అనుగ్రహిస్తాడు. పాతాళం నాగులకు నివాసస్థానం. దేవ-రాక్షస-గంధర్వులవలె సర్పజాతి చాలా విశిష్టమైనది. వాసుకి, తక్షకుడు, ఐరావతుడు, ధనంజయుడు, కర్కోటకుడు, శంఖపాలుడు, అనంతుడు, శేషుడు అను ఎనిమిదిమంది నాగుల మూల పురుషులు. ఒక్కొక్కవారం ఒక్కొక్కజాతి సర్పాలు విషపూరితాలై తిరుగుతుంటాయని ఆవారం ఆవారంనాటి సర్పం కాటువేస్తే ప్రాణాపాయమని, ఇతరసర్పం కాటువలన ప్రాణాపాయం ఉండదని చెబుతారు. సర్పాలు రకరకాల రంగులలో ఉంటాయి.[1]

సర్పాలను హింసించడం, పుట్టలు నాశంచేయడంవలన సర్పదోషం ఏర్పడుతుంది. ఇందువలన అశాంతి, సంతానరాహిత్యం, సంతాననాశం, దాంపత్యసుఖనాశం, విడిపోవడం మొ॥ కష్టాలు కలుగుతాయి అని కర్మ విపాకం చెబుతూంది. దశవిధవంధ్యాదోషాలు నాగపూజవలన తగ్గుతాయి.

నాగపూజకు నల్లని, తెల్లనిరాళ్లగాని, కొయ్య, బంగారం, వెండి, రాగి లేదా బియ్యపుపిండి విగ్రహం పనికివస్తుంది. విగ్రహం రెండుతులాల బరువుంటే మంచిది.

కలశప్రతిష్ఠచేసి అష్టనాగుల నావాహనముజేసి పూజించిన సుఖమును పొందుదురు. బ్రహ్మచారిసంతర్పణ-బ్రహ్మచర్యం-అవసరం. నాగులగడి చీర సువాసినికియిచ్చి ఆశీస్సుపొందుదురు.

---

1) నాగపూజ

ఆదివారం నాగేంద్రునికి చాలా ప్రీతికరం. పుట్టకు ధనివ్త్తడం శ్రేయో దాయకం. నాగేంద్రుని అనుగ్రహానికి 9 లేక 21 ఆదివారాలు దీక్షపడితే పూజచేయాలి. సూర్యోదయానికి ముందు పుట్టను నాగేంద్రుడిని పూజించి పుట్టమన్నును స్త్రీలు కంఠానికి గర్భానికి రాసుకోవడంవలన వంధ్యాదోషాలు తగ్గుతాయి. వ్రతానంతరం నాగశాంతి, బ్రాహ్మణభోజనం ముఖ్యం. సర్ప సూక్త-వల్మీకపూజలు చాలాగొప్పవి.

# నాగదేవత - కథలు

వరాహపురాణంలో మహాతపఉపాఖ్యానంలో అనేకవిషయాలు ప్రతిపా దింపబడ్డాయి. పూర్వం బ్రహ్మదేవుడు జగత్సృష్టిచేయడానికి పూనుకున్నాడు. అతని మనస్సునుండి కశ్యపప్రజాపతి ఉద్భవించాడు. ఆ కశ్యపప్రజాపతికి కద్రూ అనేపేరుగల భార్యఉంది. ఆ పుణ్యదంపతులకు బలపరాక్రమాలుగల అనేకమంది పుత్రులు కలిగారు. వారందరూ సర్పాలే. అనంతుడు, వాసుకి, కంబలుడు, కర్కోటకుడు, పద్ముడు, మహాపద్ముడు, శంఖుడు, కులికుడు అనేవారు కశ్యప్రజాపతి సంతానంలో ప్రధానమైనవారు. వీరు, మిగిలిన సర్పాలు లోకమంతా తిరగసాగాయి. ఇవన్నీ కుటిలమైన గమనంకలిగి, విషంతో భయంకరమై మనుష్యులనందరినీ కరుస్తూ వారిని భస్మంచేస్తూ తిరుగసాగాయి. శబ్దం ఎంతవేగంగా పయనిస్తుందో అంతవేగంగా ఈసర్పాలు తిరుగుతూఉంటే ప్రజలంతా భయపడసాగారు. రోజురోజుకు వారు నశించి పోసాగారు. అప్పుడు ప్రజలందరూ భయపడి బ్రహ్మదేవునివద్దకు వెళ్లారు. వారు బ్రహ్మనిలా ప్రార్థించారు.

"ఓ కమలసంభవా! పదునైన కోరలుగల సర్పాలనుండి మమ్మల్ని కాపాడు. ప్రతిరోజు సర్పాలు మమ్మల్ని చూపుతోటే దహిస్తున్నాయి. మనుష్యులనుగాని మృగాలనుగాని అవి భస్మంచేస్తున్నాయి. నీవు సృష్టిచేసావు. అసృష్టి అంతా ఈ సర్పాలతో నశించిపోతూంది ఈ పరిణామం గుర్తించి ఏంచేస్తే బాగుంటుందో అది చెయ్యి."

అందుకు బ్రహ్మ "ఓప్రజలారా! మీరు నిశ్చింతగా మీనివాసాలకు వెళ్లండి. మీకు నేను రక్షణకల్పిస్తాను." అని అభయం యిచ్చాడు. ప్రజలంతా తరువాత వారి నివాసాలకు వెళ్లారు. తరువాత బ్రహ్మ తాను సృష్టించిన

సృష్టిని విధ్వంసంచేస్తున్న సర్పాలను పిలిచి, వాసుకి మొదలైన ముఖ్యులను చూచి శపిస్తూ యిలా ఉన్నాడు. "నేను సృష్టించిన జీవులను మీరు నాశనం చేస్తున్నారు. ఇందుకు ప్రతిఫలంగా స్వాయంభువమన్వంతరంలో దారుణమైన తల్లిశాపంతో మీకందరికి భయంకరమైన నాశంకలుగుతుంది." వెంటనే సర్పాలన్నీ భయంతో కంపించిపోతూ బ్రహ్మదేవుని పాదాలపైపడి, "ఓదేవా! మాజాతిని కుటిలంగా సృష్టించింది నీవేగదా. క్రూరత్వము, విషంతో భయంకరంగా ఉండడం, చూపుతోటే యితరులను భయపెట్టడం నీవు సృష్టించిన లక్షణాలు. కనుక నీవు శాంతించవలసినది." ఇది విని బ్రహ్మ యిలా అన్నాడు "నిజమే. నేను మిమ్మల్ని కుటిలంగానే సృష్టించాననుకోండి, అయితే మాత్రం, ఏమాత్రం భయము, బాధలేకుండా మానవులనందరినీ ఎగిదుకు నశింపజేస్తున్నారు?" అప్పుడు సర్పాలిలా అన్నాయి. "దేవా! మాకు కొన్ని నియమాలను ఏర్పాటుచెయ్యి. మాకు స్థానంకూడ ఏర్పాటుచెయ్యి." అందుకు సమ్మతించిన బ్రహ్మ మనుష్యులతో సర్పాలకు కొన్ని నియమాలు ఏర్పాటుచేసాడు. పాతాళము, వితలలోకము, సుతలలోకము సర్పాలు నివసించడానికి స్థానాలుగా ఏర్పాటుచేసాడు. అన్ని సర్పాలను అక్కడికి వెళ్లమన్నాడు. అక్కడ అనేకవిధాలైన భోగాలను అనుభవిస్తూ ఏడురాత్రులు గడపమనిచెప్పాడు. రాత్రిఅంటే బ్రహ్మదేవునికి రాత్రి. అంటే చాలాకాలం పడుతుంది మనలెక్కలో. తరువాత వైవస్వతమన్వంతరం మొదటలో కాశ్యపుని సంతానంగా సర్పాలుంటాయని తెలిపాడు. మహాత్ముడు, బుద్ధిశాలి అయిన గరుత్మంతునికి దాయాదులవుతారు. ఆకాలంతో గరుత్మంతుడు మిమ్మల్ని తింటాడు ఇది మీదోషంకాదని సర్పాలకు తెలిపాడు.

"ఈనియమాలకు భిన్నంగాఉంటూ, క్రూరంగా సంచరించే పాములు నశిస్తాయి. కాలం తీరినవానిని మాత్రమే కరవండి. లేదా మీకు అపకారం కలిగించిన మనుష్యులను బాధించండి. మంత్రాలు, ఓషధులు, గారుడ మండలాలుకలిగి సంచరించేవారి విషయంలో మీరు భయపడండి. ఇంకేమి ఆలోచించకండి. ఈ నియమాలకు కట్టుబడిఉండకపోతే మీకు వినాశం తప్పదు." అనికూడ బ్రహ్మ చెప్పాడు. ఈవిధంగా బ్రహ్మసెలవిచ్చాక అవన్నీ పాతాళానికి వెళ్లిపోయాయి. ఇలా శాపాన్ని, అనుగ్రహాన్ని పొందిన సర్పాలు సంతృప్తిపడి పాతాళానికిచేరాయి. ఇది అంతా పంచమి తిథినాడు జరిగింది. అందుకే సర్పాలకు పంచమి అంటే చాలా యిష్టం. ఈ పంచమి అన్నిపాపా

లను పోగొడుతుంది. పంచమినాడు నియమాలతోగడిపి, పుల్లని పదార్థాలు తినకుండా సర్పప్రతిమలను ఆవుపాలతో ఎవరు అభిషేకంచేస్తారో అతనికి సర్పాలు మిత్రులవుతాయి.

## నాగగాథలు

1) కశ్యపప్రజాపతి భార్యలైన వినతాకద్రువలు విహారయాత్ర చేస్తూండగా దూరంగా ఉచ్చైశ్రవస్సు అనే ఇంద్రుడి గుఱ్ఱం కనిపించింది. గుఱ్ఱం అంతా తెల్లగాఉంది కాని తోకనల్లగా ఉంది అంది కద్రువ. కాదు అంతా తెల్లగానేఉంది అంది వినత. వారిద్దరికీ పంతం పెరిగింది. ఎవరు ఓడిపోతే వారు రెండవవారికి దాసికావాలని పందెం వేసుకున్నారు. కద్రువ మరునాడు కుటిలభావంతో తన పుత్రులైన సర్పాలను పిలచి ఆగుఱ్ఱంతోకను చుట్టుకొని నల్లగా చేయండని కోరింది. వారంతా మాట్లాడుకుని తల్లి చెప్పినది అధర్మంగాఉందని వారుచేయమన్నారు. అది విని, 'నామాట కాదన్నందుకు మీరంతా గరుత్మంతుడికి ఆహారంకండి' అని శపించింది కద్రువ. కొన్ని సర్పాలుమాత్రం బ్రతికుంటే బలుసాకుతినవచ్చునన్నట్లు భావించి గతిలేక తోకనుచుట్టుకుని నల్లగాఉన్నట్లు భ్రాంతిని కల్గించాయి. అది నిజమేననుకుని తాను ఓడినట్లు ఒప్పుకొని వినత కద్రువకు దాస్యం చేసింది. తరువాత వినతానందనుడైన గరుడుడు తల్లి గాథవిని 'అమృతం సర్పాలకిస్తే తన దాస్యంపోతుంద'ని చెప్పిన తల్లిమాట విని అమృతంతెచ్చి 'స్నానంచేసిరండి' అని సర్పాలతోచెప్పి అమృతాన్ని దర్భాసనంపై ఉంచాడు. సర్పాలు స్నానం చేసి వచ్చేలోగా ఇంద్రుడు అమృతం అపహరించాడు. సర్పాలు ఆదర్భాసనం నాకగా వాటినాలుకలు రెండుగా చీలాయి. ఆనాటినుండి అవి ద్విజిహ్వాలు అయ్యాయి. అమృతాన్ని విష్ణువు అపహరించి దేవతలకిచ్చాడని స్కాందం చెబుతూంది.

ప్రతిరోజు గరుడుడు సర్పాలను భక్షిస్తూఉండగా అవి రోజుకొకళ్లను తినమని వేడుకున్నాయి. గరుడుడు ఒప్పుకొని అలాగే తినసాగాడు. ఒకరోజు శంఖచూడుడనే సర్పానికిబదులుగా జీమూతవాహనుడనే గంధర్వుడు తన శరీరాన్ని గరుడునికి ఆహారంగా సమర్పించాడు. సగంతిన్న పక్షీంద్రుడు నిజంతెలుసుకుని జీమూతవాహనుడిని శరణువేడగా, ఇకముందు జీవహింస

చేయవద్దని, ఇప్పటివఱకు మరణించిన సర్పాలను బ్రతికించమనికోరాడు. గరుడుడు అమృతంతెచ్చి వాటిపై కురిపించి వాటిని తిరిగి బ్రతికించాడు.

2) పరీక్షిత్తు వేటకువెళ్లి అలసి తపస్సుచేసుకుంటున్న శమీకుడిని నీళ్లు అడిగాడు. సమాధిలోనున్న ఋషిపలుకలేదు. కోపించిన పరీక్షిత్తు చచ్చినపాముని అతడి మెడలోవేసివెళ్లాడు. తరువాత ఆడుకొనివచ్చిన శమీకుడి కొడుకు శృంగి అదిచూచి కోపించి వారంరోజులలోగా ఆరాజును తక్షకుడనే సర్పం కాటువేస్తుందని శపించాడు. శమీకుడు మాత్రం విచారించాడు. పరీక్షిత్తు శాపం తెలుసుకొని శ్రీమద్భాగవతం శుకుడిద్వారా వింటూ వారంరోజులు గడిపాడు. ఏడవరోజు ఒక బ్రాహ్మణుడు రాజును దీవించి పండిచ్చాడు. ఆపండులోనే సూక్ష్మరూపంతోదూరిన తక్షకుడు రాజును కాటు వేయగా, రాజు భస్మమయ్యాడు.

3) త్రేతాయుగం చివరలో ఒక నల్లనిపాము పాతాళలోకంనుండి రత్నాలనుతెచ్చి ప్రతిరోజు ఉదయం శివుడిని అలంకరిస్తూ కాలంగడిపేది. ఇలాఉండగా ద్వాపరయుగప్రారంభంలో ఒక ఏనుగు కేతకీనదిలో స్నానం చేసి శివుడిని పువ్వులు, మారేడుదళాలతో అదేశివలింగాన్ని పూజిస్తూఉండేది. పాముపెట్టిన రత్నాలను ఏనుగుతీసివేసేది. ఏనుగుపెట్టిన పువ్వులను పాము తీసివేసేది. ఈరెండింటికీ పరస్పరం వైరంకలిగింది. ఇవి ఒకనాడు పరస్పరం తన్నుకొని మరణించాయి. సువర్ణముఖీనదీతీరంలో మరణించడంవలన ఆరెండూ రుద్రగణాలుగామారి శివసాయుజ్యం పొందాయి. ఇలా ఒక సర్పం శివభక్తితో మోక్షం పొందింది. కాళహస్తిలోని శివసన్నిధిలో వీటితోబాటు ఒక సాలెపురుగుకూడ ఇలాగే తనలింగాన్ని ఇవి పూజించడం యిష్టంలేక పోరాడి మరణించి శివునిలో ఐక్యం అయింది. అందుకే కాళహస్తిలో శివుడు శ్రీకాళహస్తీశ్వరుడు అని పిలువబడుతున్నాడు. శ్రీ అనగా సాలెపురుగు, కాళమంటే పాము, హస్తిఅనగా ఏనుగు.

4) పూర్వం ఉదంకుడు అనే ముని గురుకులం విద్య పూర్తిచేసి గురుదక్షిణ యిస్తానన్నాడు. అపుడు గురువు గురుపత్నిని అడగమన్నాడు. గురుపత్ని పుణ్యకవ్రతం చేస్తున్నానని నాల్గవరోజున కుండలాలు ధరిస్తానంది. అవి పౌష్యరాజుయొక్క భార్యవద్ద ఉన్నాయని తెమ్మనమని చెప్పింది. ఉదంకుడు అలాగేచేసాడు. రాణి ఉదంకునికి కుండలాలిస్తూ నాగరాజైన

తక్షకుడు వీటిని ఆశిస్తున్నాడని జాగ్రత్తగా ఉండమని చెప్పింది. ఉదంకుడు, 'నన్ను నాగరాజు ఎమిచేయలేడు' అని తెలిపాడు. కుండలాలలో వెల్తున్న ఉదంకుడు తక్షకుడిని చూసాడు. తక్షకుడు భిక్షువురూపం ధరించి కొంతసేపు కనిపిస్తూ, కొంతసేపు కనిపించకుండా వెంటాడాడు. ఉదంకుడు కుండలాలు గట్టునపెట్టి సంధ్యావందనానికి చెఱువులో దిగాడు. అప్పుడు తక్షకుడు కుండలాలు అపహరించి నిజరూపంధరించి ఒక బిలంద్వారా నాగలోకం చేరుకున్నాడు. అక్కడకువెళ్లిన ఉదంకుడు నాగులను స్తుతించాడు. తరువాత దివ్యపురుషుడిని కూడ స్తుతించాడు. ఆ దివ్యపురుషుని సూచన ప్రకారం అశ్వంయొక్క అపానమార్గంలో ఊదగా అక్కడినుండి పొగలొచ్చి నాగలోకం కమ్మివేసాయి. తక్షకుడు సంభ్రమంతోవచ్చి కుండలాలు ఉదంకుడికి యిచ్చివేసాడు. ఉదంకుడు కుండలాలు గురుపత్నికిచ్చి గురువు నుండి అనుమతిపొంది వెళ్లాడు.

తరువాత ఉదంకుడు తక్షకుడు చేసినదానికి బదులుచేయాలని హస్తినాపురానికివెళ్లి జనమేజయుడినికలసి 'నీతండ్రిని చంపినవాడు తక్షకుడే' నని అందుకే సర్పయాగం చేయమని ప్రేరేపించాడు.

ప్రమతి కుమారుడైన రురువు ప్రమద్వరను వివాహమాడడానికి కొన్ని రోజులముందు ప్రమద్వర నిద్రించిన పామును పొరపాటున కాలితోతన్నింది. వెంటనే అది కాటువేయగా ప్రమద్వర మరణించింది. రురువు అడవిలో 'నేను గురుభక్తికలవాడను' అయితే ప్రమద్వర జీవించాలని సంకల్పింపగా, దేవ దూత నిర్దేశంపై తన ఆయుర్దాయంతో సగంయిచ్చి ప్రమద్వరను బ్రతి కించాడు. అదిమొదలు అన్నిసర్పాలను చంపుతూ ఒకనాడు ఒక డుండుభాన్ని చంపబోగా అతడు బ్రాహ్మణుడై విషంలేని తనని చంపవద్దని కోరగా రురువు అంగీకరించాడు.

ఈ డుండుభం (మట్టిలోఉండే విషంలేనిది) గతజన్మలో సహస్ర పాదుడనే ఋషి. ఖగముడనే స్నేహితుడిని గడ్డిపాముతో సరదాకిబెదరించగా, అతడి శాపంవలన సర్పంగామారి రురుదర్శనంతో శాపమోక్షం పొందాడు.

## ఆస్తీకుడు సర్పాలను రక్షించుట

పూర్వం జరత్కారువు అనే ఋషి ఉండేవాడు. అతడు బ్రహ్మచారి. అతడు పితృదేవతలను ఉద్ధరించడానికి వివాహంచేసుకొని ఆస్తీకుడనే కుమారుడిని కన్నాడు. నాగరాజు అయిన వాసుకి చెల్లెలు జరత్కారువును జరత్కారుడు వివాహమాడాడు.

కశ్యపప్రజాపతిని అతని భార్య కద్రువు వేయిసర్పాలను పుత్రులుగా పొందింది.

సముద్రమథనసమయంలో మందరపర్వతాన్ని కవ్వంగాచేసి వాసుకి అనేసర్పాన్ని త్రాడుగాచేసి అమృతం పొందారు. అప్పుడు వాసుకి తల మాటి మాటికి వాలిపోతూఉంటే విష్ణువు ముఖాన్ని పైకిఎత్తి సరిదిద్దాడు. అ సమయంలో వాసుకి ముఖంనుండి పొగతోకూడిన జ్వాలలు వెలువడ్డాయి.

సర్పాలకుండే తీవ్రవిషాన్ని గమనించి ఆ విషంపోగొట్టే విద్యను బ్రహ్మ కశ్యపునకు బోధించాడు. సర్పాలను మోస్తున్న గరుడుడు సూర్య మండల సమీపంగా వెళ్లేసరికి ఎండవేడికి సర్పాలు బాధపడసాగాయి. అప్పుడు నాగమాతఅయిన కద్రువ ఇంద్రుడిని స్తుతించింది. ఇంద్రుడు వర్షాలు కురిపించగా సర్పాలకు సంతోషం కలిగింది. సర్పాలు తమనిమోస్తున్న గరుత్మంతుడిని చూచి ఒక ద్వీపంనుండి మఱియొక ద్వీపానికి తీసుకువెళ్లమని కోరాయి. గరుత్మంతుడు దుఃఖించి ఈ దాస్యంనుండి విముక్తి ఏమిటి? అనడిగాడు. అమృతంతెస్తే దాస్యంపోతుందని సర్పాలు చెప్పాయి.

గరుడుడు అమృతంతెచ్చి దర్భలపైనుంచి స్నానంచేసి అమృతం త్రాగమని సర్పాలతో చెప్పాడు. సర్పాలు స్నానంచేసి వచ్చేలోగా ఇంద్రుడు అమృతం అపహరించుకుపోయాడు. సర్పాలువచ్చి విచారించి ఆదర్భలనే నాకాయి. అప్పుడు పదునైన దర్భలవలన సర్పాలనాలుకలు రెండుగా చీలిపోయాయి. ఆనాటినుండి సర్పాలు ద్విజిహ్వాలని పిలువబడుతున్నాయి.

## సర్పాలలో ముఖ్యమైన వాటిపేర్లు

1) శేషుడు 2) వాసుకి 3) ఐరావతము 4) తక్షకుడు 5) కర్కోటకుడు 6) ధనంజయుడు 7) కాళియుడు 8) మణినాగుడు

9) ఆపూరణుడు 10) పింజరకుడు 11) ఏలాపత్రుడు 12) వామనుడు 13) నీలుడు 14) అనీలుడు 15) కల్మాషుడు 16) శబలుడు 17) ఆర్యకుడు 18) ఆదికుడు 19) శలపోతకుడు 20) సుమనోముఖుడు 21) దధిముఖుడు 22) విమలపిండకుడు 23) ఆప్తుడు 24) కోటనకుడు 25) శంఖుడు 26) వాలశిఖుడు 27) నిష్ఠ్యానకుడు 28) హేమగుహుడు 29) నహుషుడు 30) పింగళుడు 31) బాహ్యాకర్ణుడు 32) హస్తిపదుడు 33) ముద్గరపిండకుడు 34) కంబలుడు 35) అశ్వతరుడు 36) కాళీయకుడు 37) వృత్తుడు 38) సంవర్తకుడు 39) పద్మడు 40) మహాపద్మడు 41) శంఖనకుడు 42) స్ఫండకుడు 43) క్షేమకుడు 44) పిండారకుడు 45) కరవీరుడు 46) పుష్పదంష్ట్రుడు 47) ఏళకుడు 48) బిల్వపాండుకుడు 49) మూషకాదుడు 50) శంఖశిరుడు 51) పూర్ణదంష్ట్రుడు 52) హరిద్రకుడు 53) అపరాజితుడు 54) జ్యోతికుడు 55) పన్నగుడు 56) శ్రీవహుడు 57) కౌరవ్యుడు 58) ధృతరాష్ట్రుడు 59) పుష్కరుడు 60) శల్యకుడు 61) విరజసుడు 62) సుబాహుడు 63) శాలిపిండుడు 64) హస్తిభద్రుడు 65) పిఠరకుడు 66) ముఖరుడు 67) కోణవాసనుడు 68) కుంజరుడు 69) కురరుడు 70) ప్రభాకరుడు 71) కుముదుడు 72) ముముదాక్షుడు 73) తిత్తిరి 74) హలికుడు 75) కర్కరుడు 76) అకర్కరుడు 77) కుండోదరుడు 78) మహోదరుడు.

సర్పాలు, వాటిసంతతి చాలా విస్తృతమైనది. పైన పేర్కొన్నవి ప్రధానమైన సర్పాలు.

## ఆదిశేషుడెవరు?

కద్రూదేవికి సంతానమైన సర్పాలలో ఆదిశేషుడొకడు. గరుత్మంతుడిని కాని, ఆతడి తల్లి అయిన వినతనుకాని సహించని, తనతల్లిని, సోదరులను చూచి చాలా చిరాకుపడి గంధమాదనపర్వతం, బదరికాశ్రమము, గోకర్ణము, పుష్కరారణ్యములు, హిమాలయాలు మొ॥ తీర్థాలలో, కేవలం గాలిభక్షిస్తూ తపస్సుచేసి బ్రహ్మనుమెప్పించాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై భూమండలాన్ని

నీశిరస్సుపై మోస్తూ లోకాలను రక్షించమని చెప్పాడు. అలా ధర్మాత్ముడైన ఆదిశేషుడు భూమినిమోస్తూ గొప్పవాడయ్యాడు.

### తక్షకుడు

వాసుకి మొ॥ సర్పాలన్నీ, తాము నశించాలని తమ తల్లిఅయిన కద్రువ పెట్టినశాపంతెలిసి తల్లడిల్లిపోయాయి. కొందరు యజ్ఞం చేయవద్దని జనమేజయుడిని అడుగుదామన్నారు. మంత్రులమై అతడిబుద్ధిని మారుద్దాం అన్నారు మఱికొందరు. యజ్ఞంచేయించే పురోహితుడిని కాటువేద్దాం అన్నాయి కొన్నిసర్పాలు. ఘనమేమేఘాలమై యజ్ఞాగ్నిని ఆర్పివేద్దాం అన్నాయి కొన్ని. యజ్ఞసాధనాలైన స్రుక్భాండాన్ని అపహరిద్దాం అన్నాయి కొన్ని. యజ్ఞశాలను ప్రవేశించి మనమంతా అందరినీకరుస్తూ కల్లోలం సృష్టిద్దాం అన్నారు సర్పరాజులు. యజ్ఞపదార్థాలను మూత్రపురీషాలతో మలినంచేద్దాం అన్నాయి కొన్ని. మనమే ఋత్విక్కులమై యజ్ఞవిఘ్నం చేద్దాం అన్నారు కొందరు. జలక్రీడచేసే జనమేజయుడిని బంధించి నాగలోకానికి తెచ్చి వేడు కుందాం అన్నారు కొందరు. అతడినే కాటువేస్తేసరి అన్నాయి మఱికొన్ని సర్పాలు.

నాగరాజు అయిన వాసుకికి ఇవేవీ నచ్చలేదు. అప్పుడు ఏలాపత్రుడనే సర్పం ఇలా అంది. "రాజా! రాజు సామాన్యుడుకాడు. జనమేజయుడు. యజ్ఞం తప్పక జరుగుతుంది. శాపం విన్నవెంటనే సర్పాలు బ్రహ్మతో మొఱపెట్టు కున్నాయి. అప్పుడు బ్రహ్మ యాయావరకులంలోని జరత్కారువు అదేపేరుగల అమ్మాయిని వివాహమాడి సంతానం పొందుతాడు. అతడు మిమ్మల్ని కాపాడుతాడు" అప్పుడు నేను తల్లిఒడిలో ఉండివిన్నాను. కనుక రాజా! నీసోదరి అయిన జరత్కారువును ఆ జరత్కారువుకు యిచ్చి వివాహంచెయ్యి. మనకు మేలుకలుగుతుంది. ఇది విని వాసుకి, సర్పాలు సంతోషించాయి.

సముద్రమథనసమయంలో వాసుకి మంథరపర్వతానికి త్రాడుగామారి దేవతలకు సహకరించాడు.

ఇదిలాఉండగా పరీక్షిత్తు వేటకువెళ్లి మృగాన్ని వెతుకుతూ శమీకుడనే ముని తపస్సుచేస్తూండగా వెళ్లి అడిగి సమాధానంరాలేదని తెలిసి చచ్చిన పామును అతడిమెడలో వేసాడు. అతనికుమారుడై శృంగి యిదిచూచి ఏడు రోజులలో తక్షకుడు కఱచి పరీక్షిత్తు మరణిస్తాడని శపించాడు. ముని

శాంతించి గౌరముఖుడనే శిష్యుడిద్వారా రాజుకి వార్తను చేరవేసాడు. రాజు తన జాగ్రత్తలో తానున్నాడు.

ఇంతలో తక్షకుడు ఏడవరోజు రాజును కాటువేయడానికి బయలు దేరాడు. మార్గమధ్యంలో కాశ్యపుడనే విప్రుడు తగిలాడు. తక్షకుడు బ్రాహ్మణ వేషంతో సమీపించి పలకరించాడు. తక్షకుడు కరిస్తే నేను నావిద్యద్వారా బ్రతికించి ధనం పొందాలనుకుంటున్నానని చెప్పాడు. నీవు బ్రతికించలేవు అన్నాడు తక్షకుడు. బ్రతికించగలనన్నాడు కశ్యపుడు. సరేనని తక్షకుడు నిజరూపంధరించి ఒక మఱ్ఱిచెట్టునుకరిచి భస్మంచేసాడు. వెంటనే కశ్యపుడు భస్మం పోగుజేసి విద్యచే బ్రతికించాడు.

"ధనంకోసమేగదా నీవు వెళ్లేది. అంతకంటె ఎక్కువ ధనం నేనిస్తాను. రాజుకి విప్రశాపం ఉంది. ఎటూ బ్రతుకడు. నీకీర్తిపోతుంది. వెనక్కివెళ్లు" అని తక్షకుడు కశ్యపుడిని బ్రతిమిలాడి ధనంయిచ్చి పంపాడు. తక్షకుడి సలహామేరకు కొన్నిసర్పాలు బ్రాహ్మణులుగామారి రాజుచేరి పళ్లు, దర్భలు యిచ్చాయి. రాజు తినేపండులోనే తక్షకుడు క్రిమిగాదాగి, క్రమంగాసర్పమై రాజును కఱిచాడు. తక్షకుడు ఆకాశమార్గం ద్వారా వెళ్లిపోయాడు. తరువాత పరీక్షిత్తుకొడుకైన జనమేజయుడు రాజయ్యాడు.

## ఉదంకుడికి విఘ్నం కలిగించిన తక్షకుడు

పూర్వం ఉదంకుడనే ముని తన గురుపత్ని అయిన బైదునిభార్యచేసే వ్రతానికి ధరించడానికి పౌష్యరాజు భార్య ధరించిన కుండలాలు తేవాలని వెళ్లి కుండలాలు తీసుకుని వస్తూఉండగా తక్షకుడు కుండలాలు అపహరించాలని ఒక శ్రవణకుని రూపంధరించి, మధ్యమధ్య కనుపిస్తూ, మాయమవుతూ వెంటాడాడు మధ్యలో ఉదంకుడు కొలనుఒడ్డున కుండలాలుంచి సంధ్యా వందనాదులు చేస్తూఉండగా తక్షకుడు వాటిని అపహరించి పారిపోయాడు. ఉదంకుడు వెంటబడిపట్టుకున్నాడు. అప్పుడు తక్షకుడు సర్పాకారంధరించి బిలంద్వారా నాగలోకానికి వెళ్లాడు. ఉదంకుడు నాగలోకంచేరి నాగులను స్తుతించి, దివ్యపురుషరూపధారి అయిన ఇంద్రుడిని స్తుతించి నాగులను వశం చేసుకున్నాడు. తక్షకుడు తన మందిరమునుండివచ్చి ఉదంకుడికి కుండలాలు యిచ్చివేసాడు.

## జరత్కారువు సర్పరక్షణం

జరత్కారువు అనే ముని నాగరాజయిన వాసుకి సోదరి జరత్కారువును వివాహమాడి ఆస్తీకుడనే కుమారుడిని పొందాడు. జనమేజయుడు మంత్రుల ద్వారా తన తండ్రి మృత్యువుని విని సర్పాలపై కోపగించాడు ఉదంకుడు గూడ రాజుతో తనకు విఘ్నం కలిగించిన తక్షకుడిగూర్చి చెప్పి కోపం తెప్పించాడు. జనమేజయుడు సర్పయాగం చేయడానికి పూనుకున్నాడు. సర్పాలన్ని ఆయాగంలో జనమేజయునిచే ఆహుతిచేయబడ్డాయి. తక్షకుడు భయపడి ఇంద్రుడిని శరణువేడాడు. 'నీకేభయం లేదు బ్రహ్మ ఈవిషయం చెప్పాడు.' అన్నాడు ఇంద్రుడు. ఆస్తీకుడు రాజసభలో ప్రవేశించాడు. తక్షకుడు రావాలని యాగంలో పిలువగా ఇంద్రుడు విమానంఎక్కి వచ్చాడు. ఇంద్రుడి ఉత్తరీయంలో తక్షకుడు దాగాడు. తరువాత తక్షకుడు విడివడి దీనుడై ఆకాశంలో నిలబడి పడడానికి సిద్ధమయ్యాడు. ఇంతలో రాజు ఆస్తీకుడిని వరంకొరుకోమ్మన్నాడు. ఆస్తీకుడు సర్పయజ్ఞం ఆపమనికోరి ఆపించి, నిలునిలుమని తక్షకుడిని అకష్టంనుండి కాపాడాడు. అన్నిసర్పాలు సంతసించాయి.

ఈ ఆస్తీకచరిత్ర విన్నవారికి సర్పభయం ఉండదు. ఈక్రింది విధంగా చదివితే సర్పభీతి ఉండదు.

**"జరత్కారోర్జరత్కార్వాం సముత్పన్నోమహాయశాః**
**ఆస్తీకః సత్యసంధోమాం పన్నగేభ్యోఽభిరక్షతు**
**అసితం చార్తిమన్తం చ సునీథం చాపియః స్మరేత్**
**దివా వాయది వారాత్రౌ నాస్య సర్పభయం భవేత్"**

## జీమూతవాహనుడు సర్పాలను రక్షించుట

పూర్వం కద్రూవినతలు విహరిస్తుండగా సముద్రతీరంలో దూరంగా ఒక అశ్వాన్నిచూచి 'అశ్వం అంతా తెల్లగాఉండి తోకమాత్రం నల్లగాయుంది" అన్నది కద్రువు. "కాదు తోకకూడ తెల్లగానేయున్నది" అన్నది వినత. ఇద్దఋూ పందెం వేసుకున్నారు. మఱునాడు కద్రువ తన పిల్లలైన సర్పాల్ని పంపించింది. అవి తోకను చుట్టుకున్నాయి. అదిచూచి నిజంగానే తోకనల్లగా ఉందనిభావించి ఓడిపోయాననుకుని వినత కద్రువకు పందెంలో ఒప్పందం

ప్రకారం దాసిఅయ్యింది. వినతాదేవి కుమారుడైన గరుత్మంతుడు అడుగగా అమృతం తెచ్చియిస్తే అతని తల్లి దాస్యంపోతుంతని కద్రువచెప్పగా, అందు కంగీకరించిన గరుడుడు స్వర్గంనుండి అమృతం తెచ్చియిచ్చి తన తల్లికి దాస్యవిముక్తి కలిగించాడు. తన తల్లి కష్టానికికారణం సర్పాలేనని ఆనాటి నుండి ప్రతిదినం రాజుకోసర్పం చొప్పున తినసాగాడు.

ఒకరోజు శంఖచూడుడనే సర్పం గరుడునికి ఆహారం అవుతుండగా దానిబదులు జీమూతవాహనుడనే విద్యాధరుడు తానేస్వయంగా రక్తవస్త్రాలు ధరించి శంఖచూడునిబదులు అహారంగా వెళ్లాడు. సగంతిన్న గరుడుడు, సర్పంకాదని జీమూతవాహనుడనే విద్యాధరుడని గుర్తించి క్షమాపణ అడిగాడు. జీమూతవాహనుని ఉపదేశానుసారం గరుడుడు తాను లోగడతిన్న సర్పకళేబరాలపై అమృతం కురిపించి బ్రతికించాడు. అంతేగాక ఆనాటినుండి జీవహింసవదలి దైవాంశను పెంచుకున్నాడు. ఇలా జీమూతవాహనుడు సర్పాలను రక్షించాడు.

## ప్రమద్వర సర్పదష్టయగుట

పూర్వము రురువు అనే ఋషిసుతుడు ప్రమద్వర అనే అమ్మాయిని వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఆమె ఆడుకుంటూఉండగా సర్పం కాటువేయగా ఆమె మరణించింది. అప్పుడు తన ఆయుర్దాయంలో సగమిచ్చి ఆమెను బ్రతికించుకున్నాడు. అదిమొదలు అన్నిపాములను కోపంతో చంపసాగాడు రురువు. ఒకసారి ఒకపామును కఱ్ఱతో చంపబోగా అది మునిగా మారింది.

నిజానికి ఆసర్పం సహస్రపాదుడనే ముని. తన తోటివిద్యార్థి అయిన ఖగముఖుడనేవాడిని గడ్డితో పామునుచేసి భయపెట్టాడు. అప్పుడు అతడు సర్పంకమ్మని యితడిని శపించాడు. శరణువేడుకోగా భావికాలంలో రురువు నిన్ను కొట్టడానికివస్తాడు. అప్పుడు నీకు శాపవిమోచనం అవుతుందని చెప్పాడు. ఇప్పుడు రురువును చూడడంవలన సహస్రపాదునకు శాపవిమోచనం కలిగింది.

## కాళీయుడు

యమునానదిలో కాళీయుడనే సర్పందాగి జలాన్ని విషమయంచేస్తూండగా ప్రజలు భయభ్రాంతులైనారు. శ్రీకృష్ణపరమాత్మ యమునానదిలోని కాళీయుని

పడగలపై దూకి తాండవంచేసి కాళీయుని గర్వం పోగొట్టాడు. అప్పుడు, కాళీయుడు, అతని భార్యలు ప్రార్థించగా స్వామి అనుగ్రహించి, తనపాదాల గుర్తులు పాముపడగలపై ఉండేటట్లుచేసి కాళీయుని మడుగువిడచి దూరంగా వెళ్లిపోమన్నాడు. కాళీయుడు వేరేస్థలానికి వెళ్లిపోయాడు. కాళీయుడు పూర్వ జన్మలో ఒకరాజు సంతానంకోసం మునిప్రేరణపై అడవిలో తపస్సుచేసి, ఆచెట్టుతొఱ్ఱలో ఉన్న మునిని సేవించాడు. తన పాదోదకం త్రాగమని పాదం చాచాడు. పాదం రోగంతో భయంకరంగా ఉంది. రెండుపాదాలు అలాగే ఉన్నాయి. రాజు పాదంకడిగి త్రాగకపారవేసాడు. ముని కోపించి విషసర్పం కమ్మని, విష్ణుపాదాలు నీశిరస్సుపై పైజన్మలో ఉంటాయని చెప్పాడు. అందుకే పైజన్మలో కాళీయుడనే పేరుతో విషసర్పం అయ్యాడు.

## ఖాండవవనంలో తక్షకుడు

పూర్వం అగ్నిదేవుడికి అజీర్తివ్యాధికలిగి,ఖాండవవనంలోగల ఓషధుల వలన తగ్గుతుందని తెలుసుకొని, ఖాండవవనాన్ని భక్షించడం అనగా దహించడం చేసాడు. అప్పుడు తక్షకుని కొడుకు అశ్వసేనుడు, తన తల్లి తోకపుచ్చుకొని తప్పించుకోవాలనుకున్నాడు. అది గమనించిన అర్జునుడు బాణంతోకొట్టి తల్లిపామును అగ్నిజ్వాలలలో పడేవిధంగా చేసాడు. అలాగే ఖాండవవనదాహం జరుగుతుందని ముందుగానే గ్రహించిన తక్షకుడు కురుక్షేత్రానికివెళ్లి ఆత్మరక్షణ గావించుకున్నాడు.

అశ్వసేనుడుకూడ తప్పించుకోబోతుండగా అర్జునుడు చంపాలనుకున్నాడు. కాని యింద్రుడు మోహిని అనే మాయచే అర్జునుడిని మోహితుడినిచేసి తక్షకసుతుడైన అశ్వసేనుడిని కాపాడాడు.

## కర్కోటకుడు

కర్కోటకుడనే సర్పం ఒక బ్రహ్మర్షిని నిందించగా ఆతడు కదల కుండా ఉండేవిధంగా శాపంయిచ్చాడు. ఆ శాపంవలన కర్కోటకుడు ఒకే చోట ఉండిపోయాడు ఇంతలో కార్చిచ్చు అడవియంతా కమ్మింది. ఆమంటల మధ్యలోఉండి దీనంగా ఆక్రందించి అడవిలో తిరుగుతున్న నలుడిని రక్షించ మని అడిగాడు. నలుడు అగ్నిజ్వాలలనుండి కర్కోటకుడిని కాపాడాడు.

నలుడిని కర్కోటకుడు చేతితో ధరించి పదియడుగులు వెళ్లగానే

కర్కోటకుడు నలుడిని కఱిచాడు. నలుడి శరీరంలో విషంచేరి శరీరంగానల్ల అయింది. కర్కోటకుడు నలుడితో యిలా అన్నాడు.

"ఓరాజా! నీవు చింతింపవలదు. నీశరీరంలో నావిషం ఉండడంవలన నీవు నల్లగాఅయి వికృతరూపం పొందుతావు. ప్రస్తుతం నిన్నెవరూగుర్తించరు. ఇది నీకు లాభం. నీకష్టాలు తీరగానే నన్ను స్మరించగానే నీరూపం నీకు వస్తుంది. నీశరీరంలో నావిషం ఉన్నంతవఱకు నిన్ను విషసర్పాలు, రాక్షసులు, పిశాచాలు, శత్రువులు పీడించరు. భవిష్యత్తులో నీకు భార్యా యోగం, విజయం, సుఖాలు అన్నీ కలుగుతాయి. అప్పటిదాకా నీవస్త్రం నావద్ద ఉంటుంది. నీవు తలచినప్పుడు ఇదికూడ నీవద్దకు వస్తుంది."

నలుడు కర్కోటకుడుచేసిన యీయుపకారానికి సంతోషించాడు.

## కర్కోటకుని విశేషం

ఈ కర్కోటకుడిని స్మరించి కీర్తించినవారికి కలిదోషం ఉండదు.

## భీముని సర్పముపట్టుట

పాండవులు అరణ్యవాసం చేసేరోజులలో వేటకువెళ్లిన భీముడిని ఒక పెద్ద కొండచిలువ పట్టుకుంది. భీముడు ఏవిధంగానూ విడిపించుకోలేక పోయాడు. అప్పుడా పాముకుచిక్కిన భీముడిని వెతుకుతూ ధర్మరాజురాగా అతనితో సర్పం యిలా అంది.

"ఓధర్మజా! నేను నహుషుడనే చక్రవర్తిని. ఇంద్రుడినై పల్లకిని సప్తర్షులచే మోయించుకొని అగస్త్యుడు పొట్టివాడవడంవలన సరిగామోయటంలేదని అవమానించి, అతనిచే శపింపబడి సర్పాన్నయ్యాను. నాకు పూర్వజ్ఞానము, బలము లభించాయి. నాప్రశ్నలకు నీవు సమాధానంచెబితే నాకు శాపవిముక్తి అవుతుంది. నీతమ్ముడిని వదులుతాను."

ధర్మరాజు సమ్మతించాడు. సర్పం ప్రశ్నలడిగింది. ధర్మరాజు సరైన సమాధానాలుచెప్పి భీముడిని విడిపించాడు. నహుషుడికి శాపవిముక్తి అయింది.

## నాగకన్యలు

నాగలోకంలో నాగకన్యలుంటారని పురాణాలు చెబుతున్నాయి.

## ఉలూపి

పూర్వం అర్జునుడు తీర్థయాత్రలు చేస్తున్నప్పుడు ఉలూపియనే నాగ కన్య అర్జునుడిని వివాహమాడి బభ్రువాహనుడనే కుమారుడిని కన్నది.

## జానపదగాథలలో నాగకాంతలు, సర్పాలు

పూర్వం జానపదగాథలలో కూడ నాగకన్యలు వర్ణింపబడ్డారు. ఆది శేషుడు నాగలోకంలో ఉన్నప్పుడు అతని కుమార్తె నాగకాంత సులోచన. ఇంద్రజిత్తు నాగలోకాన్ని జయించడానికివచ్చి అక్కడ సులోచననుచూసి పరవశించి వివాహమాడాడు. ఆదిశేషుడే లక్ష్మణుడుగా తరువాతకాలంలో అవతరించి ఇంద్రజిత్తుతో యుద్ధం చేసాడు. అప్పుడు నాగకాంత అయిన సులోచన లక్ష్మణుడి బాణాలను మధ్యలోనే ఆపేదట. భర్తమీద భక్తి, మమకారాలతో రంగనాథరామాయణంలో కవి గోన బుద్ధారెడ్డి యీవిషయం చెబుతాడు

పూర్వం రుక్మాంగదుడనేరాజు శాపంవలన సర్పం అయ్యాడు. అతని భార్య అతడిని కుండలోపెట్టి తీర్థాలు, పుణ్యక్షేత్రాలకు త్రిప్పింది. ఆపుణ్య నదులలో స్నానాలవలన, దేవుళ్ళను చూడడంవలన ఆతడు తిరిగి మానవు డయ్యాడు.

శ్రీరాముని కుమారుడైన కుశుడు నాగకాంత అయిన, నాగరాజుసోదరి అయిన కుముద్వతిని వివాహమాడాడు. ఇలాగే పురుకుత్సుడు నర్మద అనే నాగకాంతను వివాహమాడాడు.

## నాగారాధనా విశేషాలు

పిల్లల రక్షణకై షష్ఠీదేవిని పూజించడం రాత్రి జాగరణం చేయడం, బలి. నృత్యగీతాలతో కాలంగడపడం దశమదినంనాడు చేస్తారు. వైశ్యులు, క్షత్రియులు ఖడ్గంలో శిశురక్షణి అయిన షష్ఠీదేవిని పూజించాలి. రాకా, సుమతి, సినీవాలీ, కుపతా, వాతఘ్నీ, షష్ఠీదేవతలను ఆవాహనంచేసి పూజించాలి కుమారస్వామిని గూడ పూజించాలి. గోడమీదవ్రాసి కూడ పూజిస్తారు. షష్ఠీపూజ చాలా గొప్పది.

# నాగేంద్రుని ఆవిర్భావము

పూర్వం కైలాసంలో శంకరుడు వినాయక - కుమారస్వాములలో ఎవరికి ఆధిపత్యం ఇవ్వాలా అని సందేహించి ఎవరు అన్నితీర్థాలలో స్నాన మాడి ముందుగా తనను చేరుకుంటారో వారికే గణాధిపత్యం ఇస్తానని చెప్పాడు. కుమారస్వామి వెంటనే మయూరవాహనంఎక్కి పుణ్యనదులలో స్నానంచేయడానికి బయలుదేరాడు. విఘ్నేశ్వరుడు తన జననీజనకులైన పార్వతీపరమేశ్వరులచుట్టూ ప్రదక్షిణంచేసి అన్నినదులలో స్నానంచేసిన ఫలం పొందాడు. కుమారస్వామి నదులలో స్నానంచేస్తూఉంటే తనకంటె ముందుగానే ఆనదిలో స్నానమాడినట్లు వినాయకుడు కుమారస్వామికి దర్శన మిచ్చాడు.

కైలాసంచేరిన కుమారస్వామి తనకంటె ముందుగానే స్నానఫలం పొందిన వినాయకునిచూచి అతని మహిమనుకొనియాడి అతనికే అధిపత్యం ఇమ్మని కోరాడు. అయితే కుమారస్వామి కొంచెం బాధపడి శివునిపై అలిగి కైలాసంవిడిచి వెళ్లిపోసాగాడు. అతనిని అనునయిస్తూ శివుడుకూడ అతని వెంట బయలుదేరాడు. శివుడు కుమారస్వామిని పట్టుకోగా కుమారస్వామి నాగేంద్రుడుగామారి తప్పించుకొని పారిపోయాడు. అతడు కుమారగిరిని చేరుకున్నాడు. శివుడు నాగేంద్రుని బ్రతిమిలాడి తనకు జ్ఞానబోధచేయమని అర్థించాడు. శ్రీశైలంలోఉన్న శివుడిని తనవద్దకే రమ్మనమని కుమారస్వామి నాగేంద్రరూపుడై కుమారాచలంపై నుండి కోరాడు. శివుడు శ్రీశైలంనుండి కుమారాచలం పాదచారియైవచ్చి నాగేంద్రునివద్ద జ్ఞానబోధ పొందాడు. నాగేంద్రుని శివుడు తన కంఠంలో అలంకరించుకున్నాడు. ఆనాటి కుమారా చలమే నేటి త్రిపురాంతకక్షేత్రము.

ఇలా నాగేంద్రుడావిర్భవించినాడు.

నాగేంద్రుని పూజించడంవలన సంతానదోషాలు తొలగుతాయి. సత్సంతానం కలుగుతుంది. నాగేంద్రానుగ్రహం వలన సుఖదాంపత్యం కలుగుతుంగి. వంశాభివృద్ధి - వంశరక్షణ కలుగుతాయి.

భవిష్యత్తులో రాజయ్యేవానికి పాము పడగపడుతుంది. కాశ్మీర రాజు లలితాదిత్యుడు తాను కర్కోటక నాగవంశీయుడనని చెప్పుకున్నాడు.

## నాగపంచమి

పూర్వం ఒక బ్రాహ్మణుడు పొలం దున్నుతుండగా నాగలితగిలి కొన్ని నాగుపాముపిల్లలు చనిపోగా వాటితల్లి నాగినిచూచి దుఃఖించి పగబట్టి ఆకుటుంబంలోని వారందరినీ చంపుతూవచ్చింది. అతని కూతురుమాత్రం వివాహం అవడంవలన కుటుంబానికి దూరంగాఉంటూ వచ్చింది. అమెను కూడ చంపడానికి నాగినివెళ్ళిచూస్తే అమె నాగపూజచేస్తూ కనిపించింది. నాగిని సంతోషించి ఆకుటుంబానికి అమృతమిచ్చి మృతులనందరినీ జీవింప జేసింది. నాటినుండి శ్రావణశుక్లపంచమి నాగపంచమిగా ప్రసిద్ధికెక్కింది. ఈరోజే బ్రహ్మ శేషుడిని అనుగ్రహించాడు.

## ఇతరప్రాంతాలలో పూజావిధానాలు

ఉత్తరభారతంలో నాగసోదరియైన మానసాదేవిని పూజిస్తారు. ఈమె జరత్కారునిపత్ని. ఆస్తీకుని తల్లి. ఆస్తీకుడు జనమేజయుని సర్పయాగం ఆపాడు. ఈమె విషాహారి. నాగరక్షకి అనే పేర్లున్నాయి. బెంగాల్‌లో ఈపండుగను మానసాపంగల్ అని పిలుస్తారు. శివభక్తుడైన ఒక వ్యాపారి కుమారుని ఒక సర్పం మానసాప్రేరణపై కాటువేయగా అతనిభార్య అరటి బెరడుపై ఆబాలుని శవాన్నుంచి దేవలోకానికి తీసుకువెళ్ళింది. బీహార్‌లో దీనిని బెహలాపంచమి అంటారు. ఉత్తరప్రదేశ్‌లో సర్పాలను గోడలపైగీసి పూజిస్తారు. ఈరోజుకూడ సర్పాలకు పాలుపోస్తారు. మధ్యప్రదేశ్‌లో ఈరోజు పొయ్యి వెలిగించరు. (పెనంకాలిస్తే) నాగరుణాన్ని కాల్చినట్లని భావిస్తారు. ఉత్తరప్రదేశ్‌లో కల్లాపిచల్లి గంధంతో నాగాన్నిచేసి దీపంవెలిగించి రెండు పూటలు పూజించి నాగగాథలు వింటారు.

నేపాల్‌లో శ్రావణకృష్ణపంచమినాడు నాగపంచమి చేస్తారు. భంగు నారాయణమందిరంలో చేస్తారు. అక్కడి గరుడప్రతిమకు ప్రతిసంవత్సరం ఈరోజు స్వేదం కారుతుంది. ఆస్వేదాన్ని పూజారి గుడ్డతో తుడిచి రాజు కిస్తాడు. ఆగుడ్డలో ప్రతినూలుపోగు పాముకాటుకి ఉపశమనంగా వాడుతారు.

పంజాబ్‌లో గోడలపై నల్లనినాగులను గీస్తారు. అలా చేసినవారి ఇంట్లోకి పాములురావు.

సౌరాష్ట్రదేశంలో అనేకగ్రామాలలో నాగమందిరాలున్నాయి. దక్షిణ

భారతదేశంలో రావిచెట్టుక్రింద నాగప్రతిష్ఠ జరుగుతుంది సంతానం లేనివారు, నాగదోషం గలవారు వెండి, రాగి లోహాలతో నాగప్రతిమచేసి పూజిస్తారు.

యునాన్, ఫెనేషియా, బాబిలోనియా, సిరియా, ఆసియాఖండ ప్రాంతాలు, ఈజిప్టు, చైనా, కొరియా, టిబెట్, అఫ్రికామధ్యప్రాంతం, స్పెయిన్‌లలో నాగపూజలు, ఉపాసనలు ప్రాచీనకాలంనుండి ఉన్నాయి.

## నాగారాధన జరిగేప్రాంతాలు

ఫెర్గుసన్ ఈ నాగారాధన టురేనియన్ జాతులలో ఆరంభమైందని చెబుతాడు. ఈజిప్టులో నైలునదీప్రాంతంలో ఈ ఆరాధన ఉంది. యూదులు కూడ నాగబాధానివారణకై నాగులను పూజించారు. సిరియాలోగల నాణెములపై నాగుపాము చెట్టును చుట్టుకున్నట్లు చెక్కబడింది.

## సర్పాలకు చెందిన కొన్ని ఆచారాలు

సర్పాలకు పూజచేసే అచారాలున్నాయి. శ్రావణపూర్ణిమకు ఎక్కువగా జరుగుతాయి. శ్రావణపూర్ణిమనాడు వేయించిన యవధాన్యాన్ని కడవలలోపోసి ఉట్టిపై పెడుతారు. మట్టిపాత్రలో రొట్టెను తయారుచేసి, నేతిలోముంచి ఆరొట్టెను నేతిని హోమం చేస్తారు. వేయించిన యవలనుగూడ ఆహుతి నిస్తారు. ఈ సర్పబలిఏర్పాట్లను కొన్నిప్రాంతాలలో వితంతువు చేస్తుంది. సంతానప్రాప్తికి లేదా నాగహత్యాదోషం పోవడానికి ఈ పూజను చేసేవారు. బియ్యపుపిండితోగాని గోధుమపిండితోగాని ఆవాలపిండితోగాని సర్పంచేసి పూజించి పాయసం నైవేద్యంపెట్టి ఆహుతినిస్తారు. తరువాత సర్పాకృతిని ఆహుతిచేస్తారు. తరువాత మూడురోజులు లేక ఒకరోజు ఆ శౌచము. తరువాత ఎనిమిదిమంది బ్రాహ్మణులకు, కాల్చివేయబడిన సర్పస్థానంలో కృత్రిమసర్పాన్నుంచి పూజించి దక్షిణలతో దానం ఇస్తారు. వీటికడవలో కృత్రిమ సర్పాన్నుంచిగాని లేదా ఆవునుగాని దానం ఇస్తారు.

అథర్వణవేదంలో తక్షక - ధృతరాష్ట్ర - ఐరావత సర్పవర్ణనగలదు. రామాయణసురస గలదు.

పూర్వకాలంలో శ్రావణపూర్ణిమనుండి మార్గశిరపూర్ణిమవఱకు నాలుగు నెలలు ఈవ్రతం సాగేది. ఈవ్రతంలో భూశయనం ముఖ్యం.

## మందిరాలు - ప్రతిమలు - స్వరూపాలు

హిమాలయాలలో చంచా, కంగాడాలలో సర్పమందిరాలున్నాయి. కాశ్మీరు లోయలలో శేషనాగ్, వాసుకినాగ్, తక్షకనాగ్ - కర్కోటకనాగ్, అనంతనాగ్ మందిరాలున్నాయి. వీటికి మూడుతలలు - మానవాకారం ఉంటాయి. చనాబ్‌లోయలోను, వాసుకినాగ్ మందిరంలోను జీమూతవాహను డున్నాడు. అజంతాగుహలో 19వ నంబరు గుహలో 7 శిరస్సులతో నాగరాజు ఉంటాడు. ఇండోర్‌లో నాకలిగ్రామంలో ప్రతి దేవాలయంలోను సాధారణంగా నాగేంద్రుడుంటాడు. తక్షకుని గుడికూడ ఉంది. సాంచీస్థూప తోరణ పశ్చిమభాగంలో గౌతమునితోబాటు నాగేంద్రుడున్నాడు. ఆద్వారాలలో చాలాచోట్ల సర్పాలున్నాయి.

నాగరాజులు మధుర - మగధ-తక్షశిల-ప్రాగ్జ్యోతిషాలను పాలించారు.

## నాగరాజు - కులదైవము

'నృసింహదేవర' అనే ఇంటిపేరుగల వారింట నాగుపాము స్వేచ్ఛగా విహరించుచు రాత్రులలో కుండలో నిద్రించేదట. ఒక శుభకార్యం సందర్భంలో పొరబాటున కుండలోని నీరుకాచగా ఆసర్పం మరణించింది. అయజమానికి కలలో సర్పం కనుపించి వారి యింటిపేరును నాగశబ్దం కలిసేలా మార్చుకోమని చెప్పింది. నాగరాజుపై వారికిగల భక్తితో నృసింహదేవర అని తొలగించి నాగభట్లగా మార్చుకున్నారు. వారి యింట్లో ఇప్పటికీ నాగప్రతిమ పూజించబడుతూంది.

## నిష్ఠలవారి కులదైవం నాగేంద్రుడు (సుబ్రహ్మణ్యుడు)

మాయింటిపేరు నిష్ఠల. మాది విజయనగరం బొబ్బిలి మధ్యగల 'ఇంగిలాపల్లి' అనే అగ్రహారం. మాప్రాచీనులలో వెంకటభట్టుగారు మూల పురుషులు. వారు మహాయోగి. వారికి అప్పన్నగారని, కామేశ్వరశాస్త్రిగారని ఇద్దఱు కుమారులు. అప్పన్నగారు కొండలలో తపస్సుచేసుకుంటూ ఉండేవారు. ఒకరోజు ఊళ్లో పుట్టింట్లోఉన్నవారి సతీమణి నీళ్లకు బిందెపట్టుకుని వెళ్లుచుండగా దారిలో శ్రీ నాగేంద్రస్వామి కనుపించి వారివంశం అభివృద్ధికి వస్తుందని వారి వంశానికి సుబ్రహ్మణ్య స్వరూపుడనైన తాను కులదైవంగా ఉంటానని వారివంశంలో తన పేరుపెట్టమని చెప్పాడు. అది మొదలుకొని

మావంశంలో అందరికీ సుబ్రహ్మణ్య - నాగ - ఫణి ఇలా నాగేంద్రుని పేరు కలుస్తూఉంటుంది.

## నాగపూజాదినములు

1) శ్రావణశుద్ధపంచమి — నాగపంచమి } నాగారాధన చేస్తారు.
2) కార్తీకశుద్ధచవితి — నాగులచవితి }
3) మార్గశిరశుద్ధషష్ఠి — సుబ్రహ్మణ్యషష్ఠి - బ్రహ్మచారులకు భోజనం పెడతారు

## నాగపంచమీ విశేషాలు

చైత్రశుక్లపంచమిని గూడ కొందఱు నాగపంచమి అంటారు. కాని న్యాయంగా శ్రావణశుక్లపంచమి. ఏనెలలో అయినాసరే పంచమినాడు నాగులను పూజించి నాగదేవతానుగ్రహం పొందవచ్చును. పంచమి తిథి నాగ ప్రీతికరము. ఈనాడు అనంతుడు మొ॥ నాగులకు పూజచేసి పాలు, నెయ్యి నివేదన చేయవలెను. నాగపంచమినాడు గోడపై సర్పాన్నిగీసికాని, మట్టిచే నిర్మించిన సర్పాన్ని పూజించాలి.

## సర్పదష్టవ్రతము

సర్పంకఱచి మరణిస్తే అతని కర్మకాండలో ప్రాయశ్చిత్తం చేయాలి. ప్రతినెలలో శుద్ధపంచమిన ఉపవాసముండి పిండిచే ఐదుపడగల పామును చేసి అనంత - వాసుకి - శంఖ - పద్మ - కంబల - కర్కోటక - అశ్వతర-ధృతరాష్ట్ర - శంఖపాల - కాళియ - తక్షక - కపిల సర్పాలను సంవత్సరం పూజించి పాయసంతో విప్రునకు భోజనం పెట్టాలి. బంగారు నాగాన్ని ఆవును దానంచేసి శవసంస్కారం చేయాలి.

మూడుసార్లు హోమం చేయాలి. బంగారునాగాన్ని, పాలు, నెయ్యి కలిపినపాత్రలో ఉంచి దానంచెయ్యాలి.

## నాగపూజ

పూర్వం ఆదిశేషుడు తన వేయిపడగలపై వేయిమణులను ధరించి భూమియొక్క వేయిరంధ్రాల ద్వారా భూమిని ఛేదించాడు. ఆతీర్థమే సహస్ర ధార. ఇది సరయూనదీతీరంలో ఉంది. ఈ క్షేత్రం 25000 ధనుఃప్రమాణ పరిమాణం. ఈతీర్థంలో స్నానంచేసి ఆదిశేషుని పూజించాలి. బ్రాహ్మణులను

ఆదిశేషరూపాలుగా భావించి పూజించాలి. బంగారం, వస్త్రం, అన్నం దానం చెయ్యాలి. శ్రావణశుక్లపంచమినాడు యథావిధిగా నాగులను ఇక్కడ పూజించాలి. శేషుడిని పూజించి ఉత్సవంచేస్తే పాములుసంతోషించి మనుష్యులను బాధించవు.[1]

ఫళనిక్షేత్రంలో కుజయంత్రం గలదు. కుజునకు సుబ్రహ్మణ్యుడు అధిదేవత.[2]

## సర్పబలి

పరిశుద్ధదేశంలో సాయంకాలం, ఉదయం సర్పబలిసక్తువులతో బలి ఇవ్వాలి. సర్పదేవజనేభ్యః స్వాహా అని బలి. ఈ సర్పబలి శాస్త్రాలలో చెప్పబడింది. ప్రదక్షిణానంతరం సర్పోస్తు మంత్రపాఠం.

## నాగతీర్థం

సుతల వితల - తలాతలంలో జీవిస్తూన్న సర్పాలు జనమేజయుడి యాగంలో భస్మంకావాలనే తమ శాపానికి ముక్తికై బ్రహ్మను అడుగుదామని వెళ్లాయి. పుష్కరక్షేత్రంలో బ్రహ్మ అప్పుడు యజ్ఞం చేస్తున్నాడు. యజ్ఞ పర్వతంపై చల్లగాఉన్న సర్పాలను బ్రహ్మ చూసాడు. అపుడు ఉత్తర ముఖంగా నాగతీర్థం ఏర్పడింది. ఇది భూలోకంలో బాగా ప్రసిద్ధిపొందింది. కొన్ని నదులు, నాగకుండాలు ఏర్పడ్డాయి. నాగకుండంలో నీరు చాలా పవిత్రం. అన్నిసర్పాల విషాలను పోగొడతాయి. శ్రావణపంచమినాడు ఎవరైతే భక్తితో స్నానంచేస్తారో వారినేకాక వారి వంశంలోవారిని గూడ సర్పాలు ఎప్పుడూ బాధించవు. అక్కడ శ్రాద్ధం పెట్టినవారికి బ్రహ్మ ఉత్తమ లోకాలను ప్రసాదిస్తాడు.[1]

## నాగనామంతో దేశము

బౌద్ధకథలలో ఆంధ్రదేశము నాగభూమి అని వర్ణించబడింది. గంగ సింహళల మధ్య భూమి కూడ నాగులనివాసంగా ఉండేది. నాగవరం, నాగులపాడు, నాగులేఱు మొ॥ ప్రాంతాలు గలవు.

---

1) స్కాం. పు. వై. ఖం.
   అయోధ్యమాహాత్మ్యం—2 అ.
2) శిరివరపు మృత్యుంజయశర్మ షష్టిపూర్తిసంచిక
1) పద్మపురాణం

## నాగులచరిత్ర

ఆంధ్రదేశంలో పూర్వం జనులు సర్పాలను పూజించి నాగులుగా ఖ్యాతికెక్కారు. నాగరాజు అనురాజు కృష్ణాతీరంలో రాజ్యంచేసాడు. కుషానుల పాలనను అంతంజేసి అర్యధర్మాలుకాపాడి దశాశ్వమేధాలు చేసినవారు భార శివనాగులు. 15వ శతాబ్దంలో నెల్లూరు మండలం పాలించిన దర్శి, ఫణి వంశపురాజులు నాగజాతివారే. నాగమయ్యకు దీపం, వేడివస్తువులు కూడ దంటారు.

## నాగేంద్రుని మహిమలు

నాగేంద్రుని మహిమలు అనాదిగా కోకొల్లలు. భక్తితో వేడినవారికి వారికోరికలు తీరుస్తాడు. పగబడితే శిక్షిస్తాడు నాగదోషాలు రకరకాలుగా ఉంటాయి.

# నేటి ఆధునికప్రపంచంలో సర్పమహిమ

బొంబాయి నగరంలోని నితిన్ అనే 10 సం॥ల కుఱ్ఱవాడికి తఱచు ఫిట్స్ వస్తుండేవి. ఆ ఫిట్ వచ్చినపుడు అతడు క్రిందపడి పాములా మెలికలు తిరుగుతూ నోటితో నురగక్రక్కుతాడు. బుసకొడతాడు. ఇది ఏరకమైన అనారోగ్యమో ఎవరికీ తెలియలేదు. బొంబాయిలో స్పెషలిష్టులందరూ అతన్ని పరీక్షించి అతనికి ఏరోగమూలేదని సంపూర్ణారోగ్యం గలదని చెప్పారు. అయితే ఈ ఫిట్స్‌కు కారణం ఎవరూచెప్పలేకపోయారు. ఏపరీక్షలకూ అందలేదు. ఎన్నిమందులు వాడినా ప్రయోజనం లేకపోయింది. ఏమాంత్రికులు ఏమిచేయలేకపోయారు.

ఒకరోజు త్రాచులా బుసకొడుతూ మెలికలు తిరుగుతున్నప్పుడు తల్లి అతనిని అడిగితే ఆకుఱ్ఱవాడి మాటలద్వారా అసలువిషయం తెలిసింది. నితిన్ అంతకుముందు మంగుళూరువెళ్లి అక్కడ [illegible]లో ఆడుతూ రాళ్లవిసురుతూ ఉంటే ఒకరాయి తగిలి 'అపూచా' అనే [illegible]ము మరణించింది. అది పగబట్టి ఆత్మయై ఈపిల్లవానిని ఆవేశించి [illegible]ించి కక్షతీర్చుకుంటూంది. ఆబాలుడి ద్వారా ఆవేశించిన సర్పాత్మ చెప్పిన[illegible]గా సుబ్రహ్మణ్యస్వామివారి గుడిలో ఒక నాగస్తంభాన్ని యథావిధిగా తల్లి పూజాపురస్కారాలతో స్థాపించింది. అంతే ఆ మరునాటినుండి అతనికి అన్నిబాధలు పోయాయి.

మంగుళూరుకు 100 కి.మీ. దూరంలోగల సుబ్రహ్మణ్యస్వామి గుడిలో ఈ స్తంభం ప్రస్తుతం ఉంది.

ప్రస్తుతం నితిన్ వయస్సు 28 సం॥లు నైజీరియాలోని లాగోస్ నగరంలో ఒక ప్రైవేట్ సంస్థలో ఇంజనీర్‌గా పనిచేస్తున్నాడు.

అనాదినుండి నేటివఱకు జరిగిన ఇలాంటి మహిమలు కోకొల్లలు. అవన్నీ వ్రాయడం సాధ్యంకాదు. మచ్చుకి పైదివ్రాసాను.

## మాయింట్లో జరిగిన ఘట్టం

ఇది మా (రచయిత) యింట్లో జరిగింది. ఒకసారి 1991లో నాగుల చవితికి యథావిధిగా పూజచేసాను. ప్రసాదం స్వీకరించివెళ్ళమని మాఅమ్మాయితో చెప్పాను. ఎనిమిదవతరగతి చదివే మాఅమ్మాయి స్కూలు ఆలస్యం అవుతుందని సాయంత్రం తింటానని వెళ్ళింది. తరువాత నాలుగైదు రోజులకు మధ్యయింట్లో గడపదగ్గఱ నేను, మాఅబ్బాయి, అమ్మాయి రాత్రి గం. 7-30 లకు నించున్నాము. వంటయింట్లో పెద్దపాము తెల్లగా కొంచెం గోధుమరంగులోఉందని అరుస్తూ మాఅమ్మాయి దూరంగా వెళ్ళింది. కాని అక్కడే నించున్న నాకుగాని, మాఅబ్బాయికిగాని పాముఏమీ కనుపించలేదు. తరువాత ఇల్లంతా వెదికించినా ఏమీకనపడలేదు.

మరునాడు సోదిలో సోదికత్తె ఏమీప్రశ్నించకుండానే ఈ విషయం అంతా జరిగింది జరిగినట్లు చెప్పింది. ఆమె సోదిలో నాగేంద్రుడు వచ్చాడు. నాగులచవితినాడు నాగేంద్రుని ప్రసాదం స్వీకరించక పోవడంవలన నాగేంద్రునికి కోపం వచ్చింది. భయపెడదామని కనుపించాడు. అందుకే ఒక్క అమ్మాయికే కనుపించడం జరిగింది. తరువాత యథావిధిగా నాగేంద్ర పూజ నిర్వహించి ప్రసాదం అమ్మాయికీ, అందఱికీ ఇచ్చాము. మరొకసారి మధ్యాహ్నం నాభార్యప్రక్కనే వచ్చి కూర్చొంది. నాభార్య భయపడి వెళ్లి పోమని ప్రార్థించింది. వెంటనే వెళ్ళిపోయింది. మరుక్షణంలో ఎంతవెతికినా కనుపించలేదు.

నాగేంద్రుని మహిమలు అనంతం. అతడు భక్తులపాలిట కొంగు బంగారం. దయామయుడు. స్వానుభవం అయ్యేదాక నమ్మననరాదు. వ్యతిరేకిస్తే అనుభవంతోబాటు చేదుకూడా కలుగుతుంది. పెద్దలు చెప్పింది నమ్మాలి.





# నాల్గవ అధ్యాయము

# సర్పాసనము

## సర్పరహస్యములు

### 1) రాహుకేతువులు

సర్పాలు, సర్పదేవతలగురించి ప్రస్తావించుకునే సమయంలో నవ గ్రహాలలో స్థానం పొందినవారు, సర్పాకారంగలవారు అయిన రాహుకేతువుల గూర్చి ప్రస్తావించడం సమంజసం. వీరు సంతానదోషాలను కూడ కలిగిస్తారు. సంతానదోషం పోవడానికి శ్రీనాగేంద్రస్వామి పెట్టింది పేరు.

### 2 వేదాలలో రాహువు స్వరూపము

భక్తులకెల్లప్పుడు ధనాన్ని, సమృద్ధినివ్వాలనుకునేవాడు. స్నేహము, ప్రేమను కలిగిస్తాడు. గంధంతో, పువ్వులతో అలంకరింపబడినవాడు, గొడుగును, ఖడ్గాన్నిధరించి, సింహాసనంపై కూర్చొని దక్షిణక్కునుచూస్తూ ఉండేవాడు, నలుపు నీలంతోకలసి, అనేకశక్తులతో కూడినవాడు.

### 3) ధర్మశాస్త్రాలలో రాహువుస్వరూపం

సగం శరీరంగలవాడు. చాలా శక్తిమంతుడు, సూర్యచంద్రులను

ఇబ్బందిపెట్టేవాడు. దీపంగల పర్వతంలా ప్రకాశించేవాడు. ఆడుసింహానికి జన్మించినవాడు. సర్పం శరీరంతో చాలా భయంకరంగా ఉండేవాడు.

### 4) రాహుస్వరూపంలో రహస్యం

రాహువు నలుపునీలం కలిసిన రంగుకలవాడు. సుమారుగా ఆకాశం రంగుకలవాడు. ఆకాశం రంగుగల రాముడు, కృష్ణుడు శత్రుసంహారం చేసినట్లే రాహువుకూడ శత్రుసంహారం చేసేవాడు. రాహువు భౌతికసుఖాలను నశింపజేసేవాడు.

ఇతడు సర్పాకారం గలవాడు. జ్యోతిషంలోగల కాలసర్పయోగాన్ని ఈ రాహుకేతువులే కలిగిస్తున్నారు. ఆధ్యాత్మికానుభూతిని కలిగించేవాడు. లౌకికంగాచూస్తే సాహసాన్ని, ప్రాపంచిక విజయాన్ని, వైధవ్యాన్ని కలిగించే వాడని చెప్పవచ్చు. ఇతడు కుండలినీశక్తికి ప్రతీక.

### 5) రాహుకేతువులు - సంతానప్రతిబంధకం

కాలసర్పయోగంలోని రాహుకేతువులదోషం పోవడానికి 'కయానశ్చిత్ర' అనే మంత్రజపం చేయడం, దూర్వలు పాలు, తేనె, పంచదారతో హోమం, మినుములు, గొడుగు దానం చెయ్యాలి. సర్పశాంతి లేక బలికూడచేస్తే ఈజపం బాగా ఫలిస్తుంది.

### 6) జాతకాలలో సర్పదోషం

సూర్య, కుజ, రాహు, శనులవలన సంతానప్రతిబంధకం ఏర్పడు తుంది. ఎక్కువగా కుజరాహువుల ప్రభావంవలన సర్పదోషం ఏర్పడి సంతానంలేకుండా జరుగుతుంది. లగ్నాధిపతి, పంచమాధిపతులు బలహీనులై రాహుకుజులు సంతానప్రతిబంధకులై సర్పశాపం సూచిస్తున్నారు. గతజన్మ లలో సర్పంశపించినా సంతానం కలుగదు. కుజునకు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి అధిదేవత. రాహుకేతువుల దోషానికి నాగేంద్రపూజ అవసరం. జాతకాలలో అనేక కారణాలవలన సర్పదోషం ఉందాలేదా? అని పరిశీలించి చెప్పవచ్చు. అజాతకయోగ విషయాలు ప్రస్తుతం అంత అవసరంకాదు.

### 7) సర్పశాపం ఎలాపోతుంది?

"తద్దోషపరిహారార్థం నాగపూజాం సమారభేత్
స్వగృహోక్త విధానేన ప్రతిష్ఠాం కారయేత్సుధీః"

ఈ సర్పదోషం పోవడానికి గృహ్యసూత్రాల ప్రకారం నాగేంద్రుని బంగారపు ప్రతిమనుస్థాపించి పూజించాలి. శక్తినిబట్టి భూమి, గోవు, నువ్వులు, బంగారము మొ॥ వానిని దానంచేయాలి.

"ఏవం కృతే తు నాగేంద్రప్రసాదాద్వర్ధతే కులమ్"

ఇలాచేస్తే నాగేంద్రస్వామి అనుగ్రహంవలన సంతానప్రాప్తికలిగి వంశ వృద్ధి జరుగుతుంది.

## 8) కేతుగ్రహస్వరూపము

ఇతడు ధూమ్రవర్ణం గలవాడు. వికృతమైనముఖము, రెండుచేతు లుంటాయి. గ్రద్ధవాహనం. చిత్రమైన గంధమును ధరించును. కన్నులు ఎఱ్ఱగాఉంటాయి. భిక్షాటనంచేస్తూ ఉంటాడు. జైమినిగోత్రంలో జన్మించాడు. దక్షిణంవైపుకు తిరిగియుండును. ఇంకా కేతుగ్రహస్వరూప స్వభావాలను విశదంగా నేను నవగ్రహస్తుతిలో వర్ణించాను. ఈ గ్రహం సర్పాకారంలో ఉంటుంది.

## 9) సర్పంవలన తెలియదగిన అంశములు

సర్పం ఒంటరిగా తిరుగును. చాలా జాగ్రత్తగా ఉంటుంది. తన ప్రవర్తన ఇతరులకు తెలియనివ్వదు. అనిత్యమని తెలిసి గృహాదులను నిర్మించుకొనక నిస్సంగత్వముతో కాలము గడుపును. ఇది యోగికి యుండ దగిన లక్షణాలు. శ్రీదత్తస్వామి సర్పాన్ని గురువుగా భావించారు.

## 10) అజగరంవలన తెలియవలసినది

అజగరం అంటే కొండచిలువ. అది తన అహారాదులకోసం తిరుగక ఒకచోటనేయుండి తనకు లభించినదానితో తృప్తిపడుతుంది. దాన్నే అజగర వృత్తి అంటారు. ఇది యోగికి చాలా అవసరమని శాస్త్రాలలో చెప్పారు.

## 11) ఉపనిషత్తులలో సర్పం

పాము ఎలా తన కూసాన్నివిడుస్తుందో అదేవిధంగా జీవుడుకూడా తన దేహాన్నివిడచి కర్మానుగుణంగా మఱియొకదేహాన్ని ధరిస్తాడని ఉపమానంగా ఉపనిషత్తులలో చెప్పబడింది.

## 12) శ్రీదత్తాత్రేయస్వామి అజగరరూపం ధరించుట

శ్రీదత్తాత్రేయస్వామి యోగిచక్రవర్తులు. ఆస్వామి అజగరరూపం ధరించి ప్రహ్లాదునకు జ్ఞానబోధ చేసారు.

## 13) నహుషుడు సర్పమగుట

పూర్వం నహుషుడనే రాజుండేవాడు. అతడు 99 యజ్ఞాలుచేసి ఇంద్రుడయ్యాడు. అతడు సప్తర్షులచే పల్లకీ మోయించుకుంటూ, పొట్టివాడైన అగస్త్య మునివలన పల్లకీ ఊగుతూందనిభావించి ఆఋషిని మందలించగా, ఆఋషికి కోపంవచ్చి నహుషుడిని సర్పం అవమని శపించగా నహుషుడు సర్పం అయ్యాడు.

## నాగవిషయాలు

ఆర్కిటిక్, న్యూజిలాండ్, ఐర్లాండులలోతప్ప మిగిలిన ప్రపంచం అంతా నాగపూజ నిండిఉంది. శివుడు, జైనతీర్థంకరుడైన పార్శ్వనాథుడు నాగాభరణులు. అగ్నిపురాణంలో 80 జాతుల సర్పాలు చెప్పబడ్డాయి. బంగారురంగు గలిగి, సుగంధంతో కూడియున్నది బ్రాహ్మణజాతి సర్పాలు. ఎక్కువకోపంగలవి క్షత్రియజాతి సర్పాలు. ధూళివర్ణం గలవి వైశ్యజాతివి. నల్లనివిశ్రూదవర్ణానికి చెందినవి,

## శిల్పాలలో నాగము

నాగులనేవారు శంకునికాలంలో హిమాలయాలకు అవతల సింధునాగరికత త్రవ్వకాలలో మృణ్మయ ముద్రలపై నాగప్రతిమ గలదు. ఇద్దరు దేవతల నారాధిస్తూఉంటే వారివెనుక సర్పాలు పడగవిప్పి రక్షిస్తున్నాయి. సర్పం పాలు త్రాగుతున్నట్లు గలదు. బార్హూత్ శిలాఫలకంపై ఐదుతలలపాము యోగితో మాట్లాడుతూంది. బార్హూత్‌ను చకవాక అనే నాగము రక్షించును. నాగరాజును ఇద్దరు నాగకన్యలు సేవిస్తున్నట్లు గలదు. ఇలా సత్రము అనే నాగము బుద్ధుని సేవించినట్లు గలదు. ఉర్విల్వా అనే నాగమును బుద్ధుడు వశం చేసుకొనెను. ముచిలింద అనే నాగము ఏడురోజులు పడగపట్టి బుద్ధుని వర్షంనుండి కాపాడినది. బార్హూత్ శిల్పంలో నాగలోకం చెక్కబడింది. సాంచీ తోరణశిల్పాలలో నాగశిల్పంఉంది. నాగకన్యలు సగం సర్పాకారంతో సగం మానవాకారంతో ఉంటారు. అల్హాబాద్ మ్యూజియంలో ఒక స్తంభంపై రావి చెట్టుక్రింద ఐదుతలల ముచిలింద నాగం బౌద్ధపీఠంపై పాదుకలను రక్షిస్తూంది. సాంచి, అమరావతి నాగార్జునకొండ శిల్పాలలో నాగాలున్నాయి.

గాంధారశిల్పాలలో 'అపలాల' అనే నాగం బుద్ధునికి వశమైనట్లుంది. నాగము బుద్ధునిఎదుట మోకరిల్లింది. నీటిపైనుండి పైకివచ్చి నిలబడింది. పెషావర్ ప్రదర్శనశాలలో 7 తలల నాగాలున్నాయి. గాంధారశిల్పంలో నాగ-గరుడుల వైరుధ్యం, పంఘాయ్‌శిల్పంలో గరుడుడు నాగినిని గోళ్లతో బంధించడం గలవు. లక్నో మ్యూజియంలో నాగశిల్పాలు ఎక్కువ. మధురలో దొరికిన శిల్పాలలో, చరగాద్‌వద్దగల శిల్పాలలో 7 తలల సర్పం ముఖ్యం. నలంద శిల్పంలో నాగంపట్టుకుని దానిపై నాగుడున్నాడు.

నలంద గ్రామం నాగరాజుకు గుర్తుగా పెట్టబడింది. సారనాథ్, సంకిస నాగారాధనకు కేంద్రాలు. సిలోన్ బౌద్ధారామశిల్పాలు భారతనాగశిల్పాల్లా ఉన్నాయి. రాజ్‌సాహి, దినచ్‌పూర్, పాట్నా మ్యూజియంలలో నాగప్రతిమ లున్నాయి.

నాగశిలలను ఆరాధిస్తే సంతానం కలుగుతుంది

## నాగుల రాజ్యపాలన

క్రీ.శ. 13, 14 శతాబ్దాలలో హెూషంగాబాద్, దుర్గ్ ప్రాంతాలు పాలించారు. శివాలయాలు కట్టించారు. తూర్పుగోదావరి జిల్లాలోని తోయ్యేరు ప్రాంతం పాలించారు.

## నాగప్రాంతము

నాగద్వీపం భరతవర్షంలో ఒకఖండం అని, దాన్ని నాగులు పాలించారని, అది ప్రస్తుతం నాగపూర్ అని భావించవచ్చును.[1]

---

1) There were mwemeloar so called, and Naga Dweepa was one of the seven divisions of Bharata Varsha of this race reigned at Mathura, Padmavathi & e; and the name survives in the modern Nagapur. They were a race distinct from the Hindus —213 Page.

His wife is koumari or sena.

—Hindu Mythology and religion.

## సాముద్రికంలో సర్పం

కొందఱికి చేతులలో సర్పరేఖ ఉంటుంది. 'ధనకృత్కలశంసర్పః' అని సాముద్రికశాస్త్రం చెబుతూంది ప్రాచీనసాముద్రికశాస్త్రం ప్రకారం ధన రేఖ పురుషరేఖల నడుమ చతురస్రంఏర్పడి దానిలో సర్పరేఖ ఉంటే ధన లాభము లేక నిధినిక్షేపలాభం కలుగుతుంది.

స్త్రీరేఖకు పురుషరేఖకు ధనరేఖకు నడుమ సర్పరేఖ ఉండదగినది. ఏదిఏమైనా సర్పరేఖ చేతిలో మహాధనసూచకం. అయితే సర్పదేవతతో సంబంధంఉన్నా నాగదేవతానుగ్రహాన్ని సూచిస్తూ సర్పరేఖ ఉండవచ్చు. నాచేతిలోకూడ సర్పరేఖ ఉంది.

## సాలగ్రామంలో సర్పం

సాలగ్రామాలలో గూడ సర్పచిహ్నం ఉంటుంది. అయితే అది ఆది శేషుని గుర్తు. శేషమూర్తికుడికి తిరిగిన సుడిలో వనమాల మరియు వెన్ను నుండి తలవఱకు గుండ్రని బంగారురేఖలు కలిగి 3, 4, 5 చక్రాలతోగూడి ఉంటుంది శేషమూర్తి. లేదా చుట్టచుట్టుకొనిన సర్పరేఖతో కూడిన మూర్తి శేషమూర్తి. ఇది సాలగ్రామము.[1] విష్ణురూపంగా కూడ భావించుకోవచ్చు. ఈ సర్పచిహ్నంగల సాలగ్రామము పూజించేవారికి ఐశ్వర్యాన్నిస్తుంది.

## స్వప్నాలలో సర్పం

పాములు స్వప్నాలలోగూడ కనుపిస్తాయి. పాముపై ఎక్కి దక్షిణ దిక్కుకు వెళ్లుచున్నట్లు కలరావడం అశుభం. ఇలా కలవస్తే రోగం వస్తుంది. రోగికివస్తే మరణసూచన. పాములు వెంబడిస్తున్నట్లు కలవస్తే రాజకీయ మనుష్యులవలన భయం కలుగుతుంది. పాము కాటువేసినట్లు కలవస్తే ఆరోగ్యము ధనలాభము కలుగుతాయి. తెల్లనిపాము తనకుడిచేతిని కఱచినట్లు కలవస్తే పదిరోజులలోగా వేయిరూపాయలు లభిస్తాయని శాస్త్రం. అయితే ఇది ప్రాచీనకాలంలో మాట. ఈకాలంలో రూపాయివిలువ బాగా తగ్గింది గనుక ఇంకా పెద్దమొత్తంలో ధనలాభం కలుగుతుందని చెప్పవచ్చు.

## సాహిత్యంలో సర్పం

నాగబంధం చిత్రకవిత్వంలో భేదం. సర్పం ఆకారంగీసి దీనిలోని

---

1) అథవా కుండలీభూత నాగభోగసమప్రభః
శేషమూర్తిస్స భగవాన్ అశేషైశ్వర్యదాయకః

మెలికలలో పద్యం వచ్చేటట్లు వ్రాయడం నాగబంధం. కొందఱు కవులీ నాగబంధం వాడారు. శ్రీదాసు శ్రీరాములు కవిగారిపై శ్రీ పన్నాల సీతారామ బ్రహ్మశాస్త్రిగారువ్రాసిన అభినవగద్యప్రబంధంలో ఏకఫణి నాగబంధాన్ని చూడవచ్చు.[1]

పారిజాతాపహరణ కావ్యంలో నందితిమ్మన నాగబంధం రచించాడు.[2]

## శకునాలలో సర్పం

పాము దారిలో కనిపించడం. దారికడ్డం రావడం మంచిదికాదు. దాని వలన పనిజరుగకపోవడం, ఆటంకాలు కలుగుతాయి. అయితే పొలాలలో రైతులు వెళ్లుచున్నప్పుడు దూరంగా పడగవిత్తిఆడితే రైతుకు మంచిపంట పండుతుంది. నిద్రించే పసిపిల్లవానితలపై పాము పడగపడితే ఆతడు గొప్ప వాడు అవుతాడు లేదా రాజు అవుతాడని శకునంవలన తెలుస్తూంది.

## వాస్తువులో సర్పం

వాస్తుపురుషుడు సర్పాకారంలో ఉంటాడు. కనుక సర్పాకార వాస్తు పురుషుడిని పూజించడంవలన వాస్తుదేవతానుగ్రహంగలిగి వాస్తుదోషాలుపోయి సుఖశాంతులు కలుగుతాయి. స్థలంతో సర్పాకారదోషం ఏర్పడితే ఇంట్లో తఱచు సర్పాలు వస్తాయి. ఈదోషం పోవడానికి శాస్త్రోక్తంగా శాంతిచేయాలి. కట్టినయిండ్లలో మనుషులు నివసించకపోతే సర్పాలు తిరుగుతాయి. ఇంటికి శాస్త్రోక్తంగా శాంతిచేయించాలి. అయితే కొన్నిసర్పాలు మనుష్యులకు, ఇండ్లకు నిధులకు రక్షణకల్పిస్తూ ఉపకారంచేస్తూ ఉంటాయి. అవి దైవాంశగల సర్పాలు అని గుర్తించాలి.

గృహమధ్యలోగాని గోడలకుగాని పుట్టలు ఏర్పడినా దానిలో సర్పాలున్నా, ఆయింట్లో ఉండేవారికి సం[illegible]షం - దుస్స్వప్నం - అనారోగ్యం, అపమృత్యుభయం కలుగుతాయి [illegible]నుక యథావిధిగా శాంతి చేయించాలి.

## గ్రహణాలలో సర్పం

సూర్యచంద్రులను రాహుకేతువులు మ్రింగుతూ ఉంటారు. ఒక

1) దాసు శ్రీరాములుగారిపై పరిశోధన

2) 'ఒలదవితాన నీలఖల సాలకులక్షతివారణేశ' అనే పద్యం - పారిజాతాపహరణము

రాక్షసుడు దేవతలపంక్తిలో చేరి అమృతం త్రాగగా, దాన్ని సూర్యచంద్రులు విష్ణువుకు తెలుపగా, విష్ణువు చక్రాయుధంతో అతడి కంఠం ఖండించాడు. ముందు శరీరం కేతువు, మిగిలినభాగం రాహువయ్యాడు. ఆద్వేషంతో సర్ప రూపులైన వీరు రవిచంద్రులను మ్రింగుతున్నారు. అదే గ్రహణం.

## ఘంటలో సర్పం

ఘంటకు అనేకదేవతలు అంగాలుగా వర్ణించబడ్డారు. అందులో ఘంట లోని నాళానికి అనగా వ్రేలాడేసూత్రానికి నాగేంద్రుడు అధిదేవత. ఘంటను పూజించే సమయంలో దేవతలను గూడ పుష్పాదులతో పూజించాలి. ఇలా నాగేంద్రుడు ఘంటాపూజలో గూడ పూజింపబడుచున్నాడు. ఖగేశ్వరసంహిత గూడ ఈవిషయం తెలిపింది.

## బదనికలలో సర్పం

కొన్నిశక్తివంతమైన మూలికలు, బదనికలుగూడ సర్పాకారంలో ఉంటాయి. వీటి వివరాలు సంప్రదాయవేత్తల నుండి మాత్రమే తెలుసు కోవాలి.

## రావిచెట్టుక్రింద సర్పాలు

దేవాలయాలలో రావిచెట్టుక్రింద రెండుసర్పాలు పెనవేసుకొని ఉన్నట్లుగా శిల్పం చెక్కబడియుంటుంది ఆరెండు సర్పాలు శరీరంలోని ఇడా పింగళానాడులకు సంకేతాలు. యోగమార్గంలోని ఇడా పింగళలు సూచితాలు.

## నక్షత్రాలలో సర్పం

రోహిణీమృగశిరా నక్షత్రాలు సర్పయోనులుగా చెప్పబడ్డాయి. ఆశ్లేషా నక్షత్రానికి సర్పాలు అధిదేవతలు.

## యుద్ధాలలో సర్పం

పూర్వకాలంలో యుద్ధాలలో సైనికులు సర్పవ్యూహంపన్ని శత్రువులను జయించేవారు.

## అస్త్రాలలో సర్పం

యుద్ధాలలో భుజంగాస్త్రంవేసి శత్రువులను జయించేవారు.

కొంతకాలం క్రిందటివరకు పాముల నరసయ్య అని ఒకాయన ఉండే వాడు. ఆయన ఎలాంటి పాముకఱచినా మంత్రంతో తగ్గించేవాడట. ఇలా కఱచిందని ఫోనులో ఆయనతోచెప్పినా విషవేగం తగ్గేదట.

## అనేకతలల సర్పాలు

సాధారణంగా పాములకు ఒకే తల ఉంటుందిగాని కొన్ని సర్పాలకు అనేక పడగలుంటాయి. చూడలేదు కనుక అలాఉండవని భావించరాదు. తత్త్వగీతాలలో రెండుతలలపామున్నట్లు వర్ణించబడింది. శాండియాలో జూలో 1996వ సం॥లో రెండుతలలపాముంది. ఇది చిలీ అనేజాతికి చెందినది. వారు ఒకతలకు హెల్మాఅని, రెండవతలకు లూసీ అని పేర్లు పొట్టుకున్నారు. ఇలాగే ఎన్నిపడగలైనా ఉండవచ్చును. శ్రీ నాగేంద్రస్వామి ఆఱుతలలతో ఉండడం గమనార్హము.

## పాములు – విశేషములు

దక్షిణభారతదేశంలో స్పెక్టాకిల్డ్‌కోబ్రా అనే నాగుపాము కనిపిస్తూంది. నాగుపాము పడగపై ★ అనే పద్ధతిలో శ్రీకృష్ణపాదం కనిపిస్తుంది. కాళీయుని పడగలపై శ్రీకృష్ణుడు నాట్యంచేసిననాడు ఇకముందు నాగుర్తుగా ఈపాదాలగుర్తులు మీపడగలపై ఉంటాయని వరమిచ్చాడు. ఆనాటినుండి అన్ని నాగుపాములకు తలలపై ఇలాటి కృష్ణపాదచిహ్నాలుంటున్నాయి. అయితే పైనచెప్పిన నాగుపాముకు ఈగుర్తు లేదు. దీనికి బదులుగా ఒకటిన్నర అంగుళం వెడల్పులో రెండు సమాంతర పట్టీలున్నాయి. వీటికి రెండువైపులా నల్లనిచారలున్నాయి. నాగుపాములు కొంచెము పసుపుపచ్చని రంగుతో గోధుమచుక్కలతో ఉంటాయి. దీనికి తెల్లనిరంగుమీద ఎఱుపు, నీలం రంగులకలయికతో కట్లలాంటివి ఉన్నాయి. ఈపాము మూడున్నరఅడుగుల పొడవు, మెఱుపును కలిగియున్నది. వానపాములు రైతుకు నేస్తాలు.

పాములలో సాధారణంగా త్రాచు, జెఱ్ఱిపోతు, కట్లపాము, నీళ్లకొయ్య, తాడిగిలపాము, పసరికపాములు యిలా అనేకరకాలుంటాయి. ప్రత్యేకంగా సర్పాలను గుఱించి చెప్పడం గ్రంథలక్ష్యంకాదు గనుక ఇంతటితో ముగిస్తున్నాను.

---

★ [symbol]



## ఐదవ అధ్యాయము

# క్షేత్రానసనము

## కొన్ని పుణ్యక్షేత్రములు

ఆంధ్రదేశంలో వెలసిన అనేక సుబ్రహ్మణ్య కుమార నాగేంద్రక్షేత్రాలలో విశేషాలు చాలాఉన్నాయి. చేబ్రోలులో మొట్టమొదటిగా నిర్మించబడిన కుమారస్వామివారి దేవాలయం ఆంధ్రదేశంలోనే మొదటిదని చారిత్రకులు చెబుతారు. కాలక్రమేణ అది శిథిలమైంది వెంకటగిరి - గూడూరు మధ్య బాలాయపల్లె గ్రామానికి సుమారు 1½ మైళ్లదూరంలో సుబ్రహ్మణ్యస్వామి గుడి ఉంది. ఈ గుడిచుట్టు 'సుబ్రహ్మణ్యం' అనే గ్రామం ఉంది. క్రీ॥శ॥ 1713లో జూపల్లి వెంకటపతినాయుడుగారు స్థాపించారు.

నరసరావుపేట తాలూకాలోని చేజర్ల గ్రామంలో శ్రీ కపోతేశ్వరస్వామి దేవాలయం ఉంది. దానిలో కల్యాణమండపంప్రక్క శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి దేవాలయం ఉంది. ఇతడు 12 శిరస్సులుకలిగి ప్రతిరాత్రి గం॥ 12 నుండి గం॥ 3 వఱకు శివునికి గొడుగువలెనుండునని ప్రతీతి. గుడికి ఉత్తరంగాఉన్న కొండపై కుమారస్వామి గుడి ఉంది. ఈకొండకు కుమార స్వామికొండ అనిపేరు. ఈకొండపై ఓషధులు ఉన్నాయి.

ఇంకా ప్రతిగ్రామంలో సాధారణంగా దేవాలయాలలో నాగేంద్రస్వామి విగ్రహం చూస్తూఉంటాము. రావిచెట్టు మొదటలోకూడ నాగేంద్రుని శిల్పం ఉంటుంది.

తిరుచందూరులో ఆఱుముఖాలతో కుమారస్వామి ఉన్నాడు. దేశం అంతా సుబ్రహ్మణ్యుడు పూజింపబడినా, తమిళనాడులో ఇంకా ముఖ్యదైవం. దక్షిణదేశంలో ఆఱుప్రసిద్ధ కుమారక్షేత్రాలున్నాయి. 1) తిరుప్పరన్కున్రమ్ 2) తిరుచందూరు 3) ఫళని 4) స్వామిమలై 5) తిరుత్తణి 6) పలం ఉదిర్‌సొలై.

నాగేంద్రరూపుడైన శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి చెందిన మూడు క్షేత్రములు కర్నాటలో ఉన్నాయి. అవి క్రమంగా 1) కుక్కే సుబ్రహ్మణ్య క్షేత్రం (మంగుళూరువద్ద) 2) ఘాటి సుబ్రహ్మణ్యక్షేత్రం (దొడ్డ బళ్లాపురం నుండి 40 కి.మీ.) 3) నాగులమడినె సుబ్రహ్మణ్యక్షేత్రం (పావగడవద్ద) సుళ్ళ తాలూకాలో మలెవాడ మధ్య సుబ్రహ్మణ్య గ్రామం ఉంది. అక్కడే కుక్కే సుబ్రహ్మణ్యక్షేత్రం ఉంది. దీనికి తూర్పుగా సహ్య - కుమార - శేష- సిద్ధి పర్వతాలున్నాయి. [illegible] అడవులున్నాయి. ఉత్తరంలో కుమారధార మిగిలినదిక్కులో దర్పణ - తీర్థనదులున్నాయి. బెంగుళూరు- మంగుళూరు మార్గంలో సుబ్రహ్మణ్య రోడ్డుస్టేషనుకు 12 కి.మీ. దూరంలో ఈ క్షేత్రం ఉంది.

[illegible] కుమారధారా తీరంలో నాగరాజు [illegible] తపస్సు చేసి కుమారస్వామి ఆతనిలో అంశంగా ఐక్యమైన ఈ క్షేత్రంలో [illegible] ద్వారపదికి వెళ్ళే మార్గంలో [illegible] పూర్వం వాసుకి గరుడుని బాధ తప్పించుకోవటానికి [illegible] కుక్కే క్షేత్రంలో భక్తులు సర్పదోషాలకు నాగప్రతిష్ఠ చేస్తారు. సర్పసంస్కారం కూడ శాస్త్రీయంగా దేశంలో మరెక్కడా జరగనివిధంగా ఇక్కడ జరుగుతుంది. ఈ సుబ్రహ్మణ్యక్షేత్రం చాలా ప్రసిద్ధమైంది. పెదనందిపాడువద్ద గల నాగులపాడు (నాగవరప్పాడు)లో కూడ నాగేంద్రుడు గలడు. ఇంకా నాగేంద్రక్షేత్రాలున్నాయి. వాటిని దర్శించి మనం కృతార్థులం కావాలి.

# పుణ్యస్థలములు

## 1) కుమారతీర్థము

గంగానదిలో కుమారస్వామి పేరుమీద ఒక పుణ్యతీర్థం ఉంది. ఒకప్పుడు శ్రీ కుమారస్వామి దేవతాస్త్రీలయందు ఆసక్తుడయ్యెను. అప్పుడు పార్వతీదేవి ఆ దేవతాస్త్రీల రూపాలతో వచ్చింది. దివ్యశక్తి ద్వారా పార్వతియే ఇలా వచ్చిందని తెలిసికొని, అదిమొదలు స్త్రీలందరినీ తల్లులుగా భావిస్తూ బ్రహ్మచర్యం వహించి అరచారు. దేవులలో గొప్పవాడయ్యాడు. ఆతడు స్నానం చేసిన తీర్థంకనుకనే ఇది కుమారతీర్థం అయ్యింది. ఇక్కడ స్నానం చేసినవారికి కుమారస్వామి అనుగ్రహం కలుగుతుంది.

## కుమారవనము

పార్వతీపరమేశ్వరులు ఈ వనంలో క్రీడించారు. ఆవనంలో ప్రవేశించిన పురుషుడు స్త్రీ అవుతారని పార్వతి శాపం ఇచ్చింది. ఈ వనంలోనే కుమారస్వామి తపస్సు చేసుకొంటున్నాడు.

## పెదకళ్ళేపల్లి

కృష్ణాజిల్లాలోని ఈ క్షేత్రంలో అష్టనాగులు తపస్సుచేసి శంకరుడిని స్థాపించాయి. ఇక్కడ శివునితోబాటు అష్టనాగులుకూడా ఉన్నాయి. ఈ క్షేత్రమునకు దక్షిణమున కృష్ణానది తూర్పుగా ప్రవహించి ఉత్తరవాహినియై తూర్పుసముద్రములో కలియుచున్నది. ఈ కళ్ళేపల్లికి ప్రాచీననామము కదలుపల్లి. కర్కోటక - వాసుకి - తక్షక - శంఖచూడ - ధృతరాష్ట్ర - శంఖపాల - ధనంజయ - ఐరావతములనే అష్టనాగులు తల్లి కద్రువచే శపించబడి ఇక్కడ శిలావేదికను నిర్మించి నాలుగువైపులా అరటిచెట్లను నాటి ఈశాన్యమున గోముఖాకారముగా ఒక సరోవరమును నిర్మించి అందుస్నానముచేసి శివుని ధ్యానించి శివానుగ్రహమున జనమేజయుని సర్పయాగమునందు బాధ నొందక సుఖపడిరి. ఇక్కడి శివలింగము కర్కోటకుడను సర్పముయొక్క రూపములో ఉన్నది. కావున దీనిని కర్కోటకక్షేత్రమందురు. శివాలయమునకు ఉత్తరభాగమున నాగకుండము గలదు. ఆలయమునకు దక్షిణమునగల సత్యస్తంభమను జాతిస్తంభముయొక్క మూలమున కర్కోటకశిల ప్రతిష్ఠింపబడినది. సత్యమునుగోరి ప్రమాణముచేయువారు ఈ స్తంభమునకు ప్రదక్షి

ణము చేసినచో వారినోట సత్యమే వెలువడెడిది. యాత్రికులు మొదట కర్కోటకుని సేవించి తరువాత స్వామిని సేవించెదరు. నైరృతి దిక్కున సుబ్రహ్మణ్యేశ్వరాలయము గలదు. 'కర్కోటకక్షేత్రరూపం' 'తదుత్తరదిశి శ్రీమన్నాగకుండం శుభావహమ్' అని స్కాందసహ్యాదిఖండమున గలదు.

## బిక్కవోలు

గోదావరీనదీతీరంలో గల బిక్కవోలు సుప్రసిద్ధమైన శ్రీ సుబ్రహ్మణ్య క్షేత్రము. ఈ దేవుని నమ్మికొలిచిన వారికెటువంటి లోపముండదు. ఇట్లు భక్తులను రక్షించుపనికే బిక్కవోలులో సర్పరూపమున అవతరించినాడు.[1] సుబ్రహ్మణ్యషష్ఠికి ఇక్కడ పెద్దయుత్సవము జరుగును.

ఇంకా అనేక సుబ్రహ్మణ్య - కుమార - నాగేంద్రక్షేత్రములున్నాయి. ఇది దిఙ్మాత్రంగా ఉదహరించబడింది.

## నాగులపాడు

ఇది గుంటూరుజిల్లా పెదనందిపాడు మండలంలోనిది. ఇక్కడ శ్రీవల్లీ దేవసేనాసమేత సుబ్రహ్మణ్యేశ్వరస్వామి దేవాలయం ఉంది. ఇక్కడ తొమ్మిది అడుగుల ఎత్తు, 49 శిరస్సుల నాగేంద్రస్వామి పంచలోహ విగ్రహము, దానిపై బాలసుబ్రహ్మణ్యేశ్వరుని పాలరాతివిగ్రహము సుందరంగా నిర్మింపబడిన దేవాలయం ప్రాధాన్యమును పొందినవి. పుట్టపోగులపేరుతో పిల్లల చెవి, ముక్కుల బంగారపుపోగులు కుట్టించి పొంగళ్లుచేసి పుట్టలో పాలుపోసి మ్రొక్కుబడులు తీర్చుకుంటారు. శతాబ్దాలక్రిందటనే స్వామి ఇక్కడ వెలిసాడు. ఇక్కడ స్వామివారి కల్యాణోత్సవాలు వైభవంగా జరుగుతాయి. స్వామి వెలిసాకనే స్వామిపేరుమీద ఈ గ్రామానికి నాగులపాడనే పేరు వచ్చింది. ఈ స్వామిని దర్శిస్తే కష్టాలుతీరి కోరికలు నెరవేరుతాయి.

---

1) "కాన నెచ్చటేని పూని సుబ్రహ్మణ్య
దేవు నమ్మికొలువ దేనికైన
లోపమున్నె యాతడీపనికైకద
లీలనుండి బిక్కవోలునందు" —సుబ్రహ్మణ్యేశ్వరీయము



## ఆఱవ అధ్యాయము

# స్తోత్రాననము

## కుమార - సుబ్రహ్మణ్య - నాగేంద్ర సర్పస్తోత్రములు

### అగస్త్యుడు చేసిన స్కందస్తుతి

1) నమోఽస్తు బృందారకబృందవంద్యపాదారవిందాయ సుధాకరాయ
షడాననాయామితవిక్రమాయ గౌరీహృదానంద సముద్భవాయ.

2) నమోఽస్తు తుభ్యం ప్రణతార్తిహన్త్రే కర్త్రే సమస్తస్య మనోరథానామ్
దాత్రే రథానాం పరతారకస్య హన్త్రే ప్రచండాసురతారకస్య.

3) అమూర్తమూర్తాయ సహస్రమూర్తయే గుణాయ గుణ్యాయ పరాత్పరాయ
అపారపారాయ పరాపరాయ నమోఽస్తు తుభ్యం శిఖివాహనాయ.

4) నమోఽస్తుతే బ్రహ్మవిదాం వరాయ దిగంబరాయాంబరసంస్థితాయ
హిరణ్యవర్ణాయ హిరణ్యబాహవే నమో హిరణ్యాయ హిరణ్యరేతసే.

5) తపస్స్వరూపాయ తపోధనాయ తపఃఫలానాం ప్రతిపాదకాయ
సదా కుమారాయ హి మారమారి[illegible]కృతైశ్వర్యవిరాగిణే నమః

6) నమోఽస్తు తుభ్యం శరజన్మనే విభో ప్రభాతసూర్యారుణ దంతపంక్తయే
బాలాయ చాబాలపరాక్రమాయ షాణ్మాతురాయాలమనాతురాయ.

7) మీఢుష్టమాయోత్తరమీఢుషే నమో నమో గణానాంపతయే గణాయ
నమోఽస్తుతే జన్మజరాతిగాయ నమో విశాఖాయ సుశక్తిపాణయే.

8) సర్వస్యనాథస్య కుమారకాయ క్రౌంచారయే తారకమారకాయ
స్వాహేయ గాంగేయ చ కార్తికేయ! శైవేయ! తుభ్యం సతతం నమోఽస్తు.



శ్లో॥ వికసదమర నారీనేత్రనీలాబ్జఖండా
న్యధివసతి సదాయః సంయమాధఃకృతాని
నతురుచిరకలాపస్ఫూర్తయే యో మయూరే
వితరతు స కుమారో బ్రహ్మచర్యశ్రియం వః[1]

ఉత్తంకకృతనాగస్తుతి

1) యఖైరావతరాజానః సర్పాః సమితిశోభనాః
వర్షన్త ఇవ జీమూతాః సవిద్యుత్పవనేరితాః

2) సురూపాశ్చ విరూపాశ్చ తథా కల్మాషకుణ్డలాః
ఆదిత్యవన్నాకపృష్ఠే రేజురైరావతోద్భవాః

3) బహూని నాగవర్త్మాని గంగాయాస్తీర ఉత్తరే
ఇచ్ఛేత్కోఽన్యోఽర్కరశ్మిసేనాయాం చర్తుమైరావతం వినా

4) శతాన్యశీతిరష్టౌ చ సహస్రాణి చ వింశతిః
సర్పాణాం ప్రగ్రహా యాన్తి ధృతరాష్ట్రో యదేజతి

5) యే చైనముపసర్పన్తి యే చ దూరపరం గతాః
అహమైరావతజ్యేష్ఠభ్రాతృభ్యోఽకరవం నమః

6) యస్య వాసః కురుక్షేత్రే ఖాండవే చాభవత్సదా
తం కాద్రవేయమస్తౌషమ్ కుండలార్థాయ తక్షకమ్

1) చిత్రమీమాంసా

7) తక్షకశ్చాశ్వసేనశ్చ నిత్యం సహచరావుభౌ
కురుక్షేత్రే నివసతాం నదీమిక్షుమతీమను.

8) జఘన్యజస్తక్షకస్య శ్రుతసేనేతి యః శ్రుతః
అవసద్యోమహద్ద్యుమ్ని ప్రార్థయన్నాగముఖ్యతామ్
కరవాణి సదా చాహం నమస్తస్మై మహాత్మనే.

(భా. ఆ. 3 అ. 139 - 146½)

### అనంతనాగస్తుతి

1) బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణ సరస్సరస్వతీ
సహితమహామహీభరమజస్ర సహస్రఫణాళిదాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికి పాయకశయ్యయైనయ
య్యహిపతి దుష్కృతాంతకుడనంతుడు మాకు ప్రసన్నుడయ్యెడున్.

### వాసుకి స్తుతి

2) అరిది తపోవిభూతినపరారుల బాధలు వొందకుండగా
నురగులనెల్ల కాచిన మహోరగనాయకుడానమ
త్సురాసుర మకుటాగ్రరత్నరుచి శోభితపాదునద్రినందనే
శ్వరునకు భూషణంబయిన వాసుకి మాకుప్రసన్నుడయ్యెడున్.

### ఐరావత సర్పస్తుతి

3) దేవమనుష్యలోకముల ద్రిమ్మరుచున్ విపులప్రతాప సం
భావిత శక్తిశౌర్యులు నపారవిషోత్కటకోప విస్ఫుర
త్పావక తాపితాఖిల విపక్షులునైన మహానుభావులై
రావతకోటిఘోర ఫణిరాజులు మాకు ప్రసన్నులయ్యెడున్.

### తక్షకుని స్తుతి

4) గోత్రమహామహీధర నికుంజములన్ విపినంబులం గురు
క్షేత్రమునం బ్రకామగతిఖేలననొప్పి సహాశ్వసేనుడై
ధాత్రి పరిభ్రమించు బలదర్పపరాక్రమ దక్షుడీక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుడు శూరుడు మాకు ప్రసన్నుడయ్యెడున్.

(ఆం. భా. ఆది. అ. 104 - 107 ప.)

## విషహరీనాగేశ్వరీ స్తుతిః

1) జరత్కారుర్మహాగౌరీ మనసా సిద్ధియోగినీ
వైష్ణవీ నాగభగినీ శైవీనాగేశ్వరీ తథా

2) జరత్కారుప్రియాస్తీకమాతా విషహరేతి చ
మహాజ్ఞానయుతాచైవ సాదేవీ విశ్వపూజితా.

పంచమి ఈ దేవికి యిష్టమైన తిథి. కశ్యపుడు సర్పభయం పోవడానికి ఈదేవిని సృష్టించెను.

## షష్ఠీదేవి స్తుతి

1) నమోదేవ్యై మహాదేవ్యై సిద్ధ్యై శాన్త్యై నమో నమః
శుభాయై దేవసేనాయై షష్ఠ్యై దేవ్యై నమో నమః

2) వరదాయై పుత్రదాయై ధనదాయై నమో నమః
సుఖదాయై మోక్షదాయై షష్ఠ్యై దేవ్యై నమో నమః

3) సృష్ట్యై షష్ఠాంశరూపాయై సిద్ధాయై చ నమో నమః
మాయాయై సిద్ధయోగిన్యై షష్ఠీదేవ్యై నమో నమః

4) సారాయై శారదాయై చ పరాదేవ్యై నమో నమః
బాలాధిష్ఠాతృదేవ్యై చ షష్ఠీదేవ్యై నమో నమ.

5) కల్యాణదాయై కల్యాణ్యై ఫలదాయై చ కర్మణామ్
ప్రత్యక్షాయై స్వభక్తానాం షష్ఠ్యైదేవ్యై నమో నమః

6) పూజ్యాయై స్కందకాంతాయై సర్వేషాం సర్వకర్మసు
దేవరక్షణకారిణ్యై షష్ఠీదేవ్యై నమో నమః

7) శుద్ధసత్త్వ స్వరూపాయై వందితాయై నృణాం సదా
హింసాక్రోధవర్జితాయై షష్ఠీదేవ్యై నమో నమః

8) ధనందేహి ప్రియందేహి పుత్రందేహి సురేశ్వరి
మానందేహి జయందేహి ద్విషో జహిమహేశ్వరి.

9) ధర్మందేహి యశోదేహి షష్ఠీదేవ్యై నమో నమః
దేహి భూమిం ప్రజాందేహి విద్యాందేహి సుపూజితే.

10) కల్యాణం చ జయందేహి విద్యాదేవ్యై నమో నమః
వీరం పుత్రంచ గుణినం విద్యావన్తం యశస్వినమ్
సుచిరాయుష్యవన్తం చ సూతే దేవిప్రసాదతః

## కుమారస్తుతిః

1) మయూరాధిరూఢం మహావాక్యగూఢమ్
మనోహారిదేహం మహచ్చిత్తగేహమ్
మహీదేవదేవం మహావేదభావమ్
మహాదేవబాలం భజే లోకపాలమ్.

2) అపస్మారకుష్ఠక్షయాద్యాః ప్రమేహ-
జ్వరోన్మాదగుల్మాదిరోగా మహాన్తః
పిశాచాశ్చ సర్వే భవత్పత్రభూతిమ్
విలోక్యక్షణాత్తారకారే ద్రవన్తే.

శ్రీ ఆదిశంకరవిరచిత
—సుబ్రహ్మణ్యభుజంగప్రయాతమ్

## సుబ్రహ్మణ్యస్తుతిః

(శ్రీ శంకరాచార్యులవారు)

1) గాంగేయం వహ్నిగర్భం శరవణజనితం జ్ఞానశక్తిం కుమారమ్
బ్రహ్మణ్యం స్కందదేవం గుహమనఘ గుణం రుద్రతేజస్స్వరూపమ్
సేనాన్యం తారకఘ్నం గురుమచలమతిం కార్తికేయం షడాస్యమ్
సుబ్రహ్మణ్యం మయూరధ్వజరథసహితం దేవదేవం నమామి

## కార్తికేయస్తోత్రము

1) షణ్ముఖస్కంద విశ్వేశ కుక్కుటధ్వజ పావకే
కంపితారే కుమారేశ స్కందబాలగ్రహానుగ.

2) జితారేక్రౌంచ విధ్వంస కృత్తితాజ శివాత్మజ
భూతగ్రహపతిశ్రేష్ఠ పావకప్రియదర్శన
మహాభూతపతేః పుత్ర త్రిలోచన నమోఽస్తుతే.

## రాహుస్తుతిః

1) కరాళవదనం ఖడ్గచర్మశూలవరాన్వితమ్
నీలసింహాసనం ధ్యాయేద్రాహుం తం చ ప్రశాంతయే.

ఇది ప్రసిద్ధమైన శ్లోకం

**నా నవగ్రహ స్తుతి గ్రంథంలో నాచే రచింపబడిన "రాహు స్తుతి"**

1) సైంహికేయ నమస్తుభ్యం చంద్రాదిత్యవిమర్దన
విష్ణుచక్రవిభిన్నాయ మరుతేమృత్యుజిష్ణవే.

2) ద్వంద్వం యస్యోన్నతం స్థానం తస్మై కన్యావతే నమః
వైధవ్యవిప్లవాదీనాం కర్త్రే భుజగరూపిణే.

3) కేవలం శిరసా శిష్టః శిష్టశ్శిష్టజనప్రియః
పాయాచ్చండార్చిషం పిండగ్రాసం హి గ్రసతే చయః

4) అపోక్లిమే ఫణపరే కేంద్రే లగ్నేఽపి వా స్థితః
ఆత్మానం స్తువతాం నిత్యం యః పీడాహృత్ సపాతునః

5) నైరృత్యాః కకుభోభర్తా తమోహీన స్తమోస్తు నః
స్థితిం పితృవనేకర్తా యస్సౌఖ్యపరివర్ధకః

6) అబాధితో మహాచ్ఛాయః స్వర్భానుర్భానుభానుభిః
అష్టసైంధవ సంక్లప్తస్యందనస్సోఽవతాచ్చనః

7) చంద్రార్కమర్దనో రాహుః భరణీజ స్తమోమయః
తామసం భూతసంతాపి ప్రాప్తవాన్ ధామపాతుయః

8) భూతధాత్ర్యాః మహాచ్ఛాయాం గృహీత్వాయ స్తమోమయః
దృశ్యతే గగనేవీరః సపాయాత్పర్వసు ప్రభుః

9) మూలాధారోర్ధ్వ సంధ్యాతః శవర్ణాదిమనుస్తుతః
గోమేదవర్ణరుచిరః పాయాచ్చ వ్యతిరేకగః

10) ప్రతీహారేస్థితః కాశ్యాః యశ్చాత్మజ్ఞో నిరంజనః
ఐశ్వరేణ కటాక్షేణ పూతః పాతు తప స్తతిః

11) స్థితః సూనుః సింహికాయాః అధస్తాదంశుమాలినః
యోజనాయుతవిస్తీర్ణమండలాచ్ఛాదకోఽవతు.

12) చక్రభిన్నగలః పాతు శింశుమారగలస్థితిః
అమరో విష్ణుభక్తాగ్ర్యః రాహురీడితసద్గుణః

— నిష్ఠల సుబ్రహ్మణ్యః

## కేతు స్తుతిః

1) ధూమ్రవర్ణం ద్విబాహుంచ కేతుం చ వికృతాననమ్
గృధ్రాసనగతం నిత్యం ధ్యాయేత్సర్వఫలాప్తయే.

ఇది ప్రసిద్ధస్తుతి

## నా నవగ్రహ స్తుతిలోని
## కేతు స్తుతిః

1) ధృత్వా యో యోగిరూపం సకలజనముదే బోధయన్ వేదతత్త్వమ్
ఛిత్వా కామాదిబంధాన్ మునిజననికరైః స్తూయమానోవిరక్తః
స్వాత్మాభిన్నస్వరూపం నఖలునయనయోర్యస్య లోకేనభాతి
తంకేతుం త్యాగమూర్తిం గుణలసితమహం చేతసా నౌమిభక్తః.

2) ఫాలేపుండ్రం దధానః కిసలయసదృశే హస్తయుగ్మే సుపాత్రమ్
వ్యాళంకంఠే మహౌజాః శివపదయుగలే నిశ్చలాయస్య భక్తిః
మూర్ధ్నాహీనోమహాత్మా పరిచరతిగృహానన్న సంపాదనాయ
తం కేతుం యోగిరాజం ప్రణమత సుజనాః ఆత్మనీనాయరాజమ్.

3) జ్వలన్తం మార్తాండం స్వమనసి మహాక్షోభజనకమ్
సుదూరస్థం శత్రుం గ్రససి తవ శక్తిర్నిరుపమా
గతిం చక్రే భిన్నాం వహసి సదనం తే నఘటితమ్
కరోషి త్వం శీఘ్రం గరలఘటితం చౌషధిపతిమ్.

4) కేతుం మోక్షపథం నృణాం ప్రదదతం ధూమ్రాఖ్యశక్త్యాయుతమ్
భక్తం శూలిని ధూమ్రవర్ణవపుషం తంబ్రహ్మభావస్థితమ్
మన్త్రజ్ఞం నిపుణం చ పక్షిశకునేతీర్థే భ్రమన్తం గ్రహమ్
వేత్తారం సునిధీన్ కృతజ్ఞమగదంకారం భజే సర్వదా.

5) హేవృశ్చికోన్నత రవీందు విమర్దకారిన్ మోక్షస్యకారక వినాయక
భక్తికర్తః
మీనే విరాజిత వదాన్య గుణప్రసిద్ధ త్వంపాహిపాదకమలాశ్రిత
భక్తభృంగాన్.

6) వైడూర్యదానసం తపతోషకారి తులాదిషట్కంచ శుభగృహంతే
చరస్యహావత్సరసప్తకం త్వం మాంపాహి కేతో కరుణార్ద్రదృష్ట్యా.

7) ఆశ్లేషాతారకాజాతః శిఖీ మృత్యుంజయో ధ్వజః
కబంధరూపః ఖచరః బంధాన్ బధ్నాత్వరిందమః

8) చండార్చిర్గ్రిస్యతేయేన ఛిన్నోయశ్చామరః స్మృతః
అనుష్ణః పాతు స శిఖీ ముక్తిదశ్శిఖిభిః స్తుతః

9) రుచింమారకతీంవోఢ్రే స్వరిప్ఫాచ్ఛాదకాయవై
ఏకాధికచతుర్వర్ణ న్యాసాయ శిఖినే నమః.

—నిష్ఫల సుబ్రహ్మణ్యం

## సుబ్రహ్మణ్య స్తుతిః

1) సింధూరారారుణకాంతిమిందువదనం కేయూరహారాదిభిః
దివ్యైరాభరణైర్విభూషితతనుం స్వర్గస్యసౌఖ్యప్రదమ్
అంభోజాభయ శక్తికుక్కుటధరం రక్తాంగ రాగాంశుకమ్
సుబ్రహ్మణ్యముపాస్మహే ప్రణమతాం భీతిప్రణాశోద్యతమ్

## సుబ్రహ్మణ్యాష్టకమ్

1) హేస్వామినాథ కరుణాకర దీనబంధో శ్రీపార్వతీశముఖపంకజ పద్మబంధో
శ్రీశాదిదేవగణ పూజితపాదపద్మ వల్లీసనాథ మమదేహికరావలంబమ్.

2) దేవాదిదేవసుత దేవగణాధినాథ దేవేంద్రవంద్యమృదుపంకజ మంజుపాద
దేవర్షినారద మునీంద్రసుగీతకీర్తే వల్లీసనాథ... ........

3) నిత్యాన్నదాన నిరతాఖిలరోగహారిన్ తస్మాత్ప్రదానపరిపూరిత భక్తరామ
శ్రుత్యాగమ ప్రణవవాచ్యనిజస్వరూప వల్లీసనాథ .. ........

4) క్రౌంచాసురేంద్రపరిఖండనశక్తిశూల పాశాదిశస్త్రపరిమండిత దివ్యపాణే
శ్రీకుండలీశ ధృతతుండ శిఖీంద్రవాహ వల్లీసనాథ............

5) దేవాధిదేవరథమండలమధ్యవేద్య దేవేంద్రపీఠనగరందృఢచాపహస్తమ్
శూరం నిహత్యసురకోటిభిరీడ్యమానం వల్లీసనాథ..........

6) హారాదిరత్నమణియుక్తకిరీటహార కేయూరకుండలలసత్కవచాభిరామ
హేవీరతారక జయామరబృందవంద్య వల్లీసనాథ..........

7) పంచాక్షరాదిమనుమంత్రితగాంగతోయైః పంచామృతైః
ప్రముదితేంద్ర ముఖై ర్మునీంద్రైః
పట్టాభిషిక్తహరియుక్త పరాసనాథ వల్లీసనాథ...........

8) శ్రీకార్తికేయ కరుణామృతపూర్ణదృష్ట్యా కామాదిరోగకలుషీకృత
దుష్టచిత్తమ్
సిక్త్వాతుమామవకళాధరకాంతికాన్త్యా వల్లీసనాథ...........

9) సుబ్రహ్మణ్యాష్టకం పుణ్యం యే పఠన్తి ద్విజోత్తమాః
తే సర్వే ముక్తిమాయాన్తి సుబ్రహ్మణ్యప్రసాతతః

10) సుబ్రహ్మణ్యాష్టకమిదం ప్రాతరుత్థాయయః పఠేత్
కోటిజన్మకృతం పాపం తత్క్షణాదేవ నశ్యతి.

"మహావీరం కార్తికేయం క్రౌంచగర్వవిదారణమ్
ఆగ్నేయం గాంగేయం చ విశాఖం విష్ణుతేజసమ్
నాగదోషహరం దేవం సర్వదేవగణాధిపమ్
గణాధిపానుజం రమ్యం భజే వంధ్యావిరోధినమ్"

## సుబ్రహ్మణ్యాష్టోత్తర శతనామములు

| | | | |
|---|---|---|---|
| ఓం స్కందాయ | నమః | ఓం తారకాసురసంహారిణే | నమః |
| ఓం గుహాయ | ,, | ఓం రక్షోబలవిమర్దనాయ | ,, |
| ఓం షణ్ముఖాయ | ,, | ఓం మత్తాయ | ,, |
| ఓం ఫాలనేత్రసుతాయ | ,, | ఓం ప్రమత్తాయ | ,, |
| ఓం ప్రభవే | ,, | ఓం ఉన్మత్తాయ | ,, |
| ఓం పింగళాయ | ,, | ఓం సురసైన్యసురక్షకాయ | ,, |
| ఓం కృత్తికాసూనవే | ,, | ఓం దేవాసేనాపతయే | ,, |
| ఓం శిఖివాహనాయ | ,, | ఓం ప్రాజ్ఞాయ | ,, |
| ఓం ద్విషడ్భుజాయ | ,, | ఓం [illegible]పాళవే | ,, |
| ఓం శక్తి ధరాయ | ,, | ఓ[illegible]త్సలాయ | ,, |
| ఓం పిశితాశప్రభంజనాయ | ,, | ఓ[illegible]సూతాయ | ,, |

| | | | |
|---|---|---|---|
| ఓం శక్తిధరాయ | నమః | ఓం అగ్నిగర్భాయ | నమః |
| ఓం కుమారాయ | ,, | ఓం శమీగర్భాయ | ,, |
| ఓం క్రౌంచదారణాయ | ,, | ఓం విశ్వరేతసే | ,, |
| ఓం సేనాన్యై | ,, | ఓం సురారిఘ్నే | ,, |
| ఓం అగ్నిజన్మనే | ,, | ఓం హరిద్వర్ణాయ | ,, |
| ఓం విశాఖాయ | ,, | ఓం శుభతరాయ | ,, |
| ఓం శంకరాత్మజాయ | ,, | ఓం వటవే | ,, |
| ఓం శివస్వామినే | ,, | ఓం వటువేషభృతే | ,, |
| ఓం గణస్వామినే | ,, | ఓం పూష్ణే | ,, |
| ఓం సర్వస్వామినే | ,, | ఓం గభస్తయే | ,, |
| ఓం సనాతనాయ | ,, | ఓం గహనాయ | ,, |
| ఓం అనంతశక్తయే | ,, | ఓం చంద్రవర్ణాయ | ,, |
| ఓం అక్షోభ్యాయ | ,, | ఓం కళాధరాయ | ,, |
| ఓం పార్వతీప్రియనందనాయ | ,, | ఓం మాయాధరాయ | ,, |
| ఓం గంగాసుతాయ | ,, | ఓం మహామాయినే | ,, |
| ఓం శరోద్భూతాయ | ,, | ఓం కైవల్యాయ | ,, |
| ఓం ఆహూతాయ | ,, | ఓం శంకరాత్మజాయ | ,, |
| ఓం పావకాత్మజాయ | ,, | ఓం విశ్వయోనయే | ,, |
| ఓం జృంభాయ | ,, | ఓం అమేయాత్మనే | ,, |
| ఓం ప్రజృంభాయ | ,, | ఓం తేజోనిధయే | ,, |
| ఓం ఉజ్జృంభాయ | ,, | ఓం అనామయాయ | ,, |
| ఓం కమలాసనసంస్తుతాయ | ,, | ఓం పరమేష్ఠినే | ,, |
| ఓం ఏకవర్ణాయ | ,, | ఓం పరబ్రహ్మణే | ,, |
| ఓం ద్వివర్ణాయ | ,, | ఓం వేదగర్భాయ | ,, |
| ఓం త్రివర్ణాయ | ,, | ఓం విరాట్సుతాయ | ,, |
| ఓం సుమనోహరాయ | ,, | ఓం పుళిందకన్యాభర్త్రే | ,, |
| ఓం చతుర్వర్ణాయ | ,, | ఓం మహాసారస్వతావృతాయ | ,, |
| ఓం పంచవర్ణాయ | ,, | ఓం ఆశ్రితాఖిలదాత్రే | ,, |
| ఓం ప్రజాపతయే | ,, | ఓం చోరఘ్నాయ | ,, |
| ఓం అహస్పతయే | ,, | ఓం రోగనాశనాయ | ,, |

| | | | |
|---|---|---|---|
| ఓం అనంతమూర్తయే | నమః | ఓం విరుద్ధహన్త్రే | నమః |
| ఓం ఆనందాయ | ,, | ఓం వీరఘ్నాయ | ,, |
| ఓం శిఖండికృతకేతనాయ | , | ఓం రక్తశ్యామకంథరాయ | ,, |
| ఓం డంభాయ | ,, | ఓం సుబ్రహ్మణ్యాయ | ,, |
| ఓం పరమడంభాయ | ,, | ఓం గుహాయ | ,, |
| ఓం మహాడంభాయ | ,, | ఓం ప్రీతాయ | ,, |
| ఓం వృషాకపయే | ,, | ఓం బ్రహ్మణ్యాయ | ,, |
| ఓం కారణోపాత్తదేహాయ | ,, | ఓం బ్రాహ్మణప్రియాయ | ,, |
| ఓం కారణాతీతవిగ్రహాయ | ,, | ఓం వంశవృద్ధికరాయ | ,, |
| ఓం అనీశ్వరాయ | ,, | ఓం వేదవేద్యాయ | ,, |
| ఓం అమృతాయ | ,, | ఓం అక్షయఫలప్రదాయ | ,, |
| ఓం ప్రాణాయ | ,, | ఓం నాగేంద్రాయ | ,, |
| ఓం ప్రాణాయామపరాయణాయ | ,, | | |

## నాచే (గ్రంథకర్త) రచింపబడిన కుమారస్తుతి

1) కుమారహన్తుర్భువనస్య శం మే కుమారతాం దేహి వివేకయుక్తామ్
కుమాప్రవృద్ధిం సుకుమారగాత్ర కుమారభోస్యమ్యగుమాసుత త్వం.

2) దీర్ఘేవ భిత్తిర్నగరాడభేది క్రవ్యాదనుచ్ఛక్తిధరః ప్రసన్నః
పాణిః పుళింద్యాః జగృహే చ యేన మహేంద్రకన్యాసహితః పునాతు

3) యస్తత్త్వమస్యాదివచో నిరూప్యః బ్రహ్మాత్మకో బాలవటుః సుఖాయ
స బ్రహ్మచర్యాపరినిష్ఠితోనః స్వర్గాంగనాభక్తిసమర్చితోఽవతు.

## శ్రీవల్లీదేవిస్తుతిః

దీనికే స్వర్ణధారాస్తుతి అని మఱియొకపేరు. ఇదికూడ నాచే (గ్రంథకర్త) రచింపబడినదే.

1) వల్లిత్వత్పదదాసోఽయం క్షుబ్ధః ప్రారబ్ధజృంభణైః
రోరుదీతి విధిత్సుస్తే స్తుతీః పక్షీవ చంక్రమీ

2) విప్లైశ్చ నానావిషయైః విషమీకృతశేముషీమ్
విషాపనుచ్ఛవల్లీవ వల్లీ శుద్ధీకరోతునః

3) న కుమారీ కుమారీ చ వల్లీ వల్లీ న సామతా
సేనాసమాఽసమాఖేన యోజానాతి స పండితః

4) ఐహలౌకికసౌఖ్యాని దాత్రీ సా విమతిర్నహి
మధ్యేశాతా చిరం శాతం శాంతాశా సంతనోతు నః

5) పుళింద్యళిందసంచారః ప్రచారో వేదపద్ధతేః
ఆచారః స హి శిష్టోక్తః విచారః శ్రుతిసమ్మతః

6) యా చైహికాని చ సుఖాని దదాత్యనుక్తా
ఉక్తా వ్యపోహతి రుజం మమ మానసీం సా
తన్వీ తనూకృతరుజం విరుజం క్రమేణ
శుద్ధం కరోతు మయి మంగలమావసంస్తీ.

7) స్వర్ణార్ణసో వితనుతమ్ వినుతే సునేత్రే
తే స్వర్ణదీ కనకసూనసమే మనీషే
స్కందేకృతీ విషమరోపసురోణాని
సంధిత్సునీ వివదమాన సరోరుహాణి

8) సమస్తే చలోకే సమస్తే విశేషైః
సమాస్తే భవత్యుజ్జ్వలామే శివాయ
సమాస్తే చితేః శ్రీః న కా కేవలాయాః
నమస్తే నమస్తే నమస్తే నమస్తే.

9) అనంగస్యతంత్రం భుజంగస్యరాజ్యమ్
భుజంగీసుకైశ్యే లతాంగీచభృంగీ
అనంగీకరోత్యబ్జవృందే మృదుత్వం
సమంగీకరోతు స్తుతిం మంగలాశ్రీః

10) ధ్యాతావై దేవతాస్సర్వాః త్యక్తాస్సర్వాః క్రియాః మయా
త్వమేవ ధ్యాయసే వల్లి నామ్ని స్వాంతే యతోమ్మృదుః

11) లిలిక్షుసౌందర్యం తవ జనని వాచామవిషయమ్
శ్రుతేర్మన్యే స్కందః శ్రవణవికలోత్కృష్టనయనః
మిమంక్షుర్గానాబ్ధౌ నయనమపహాయ శ్రవణవాన్
అసావిత్థం కాలం గమయతి పరిత్యక్తవిషయః

12) అంబికే విలసదంబకయుగ్మ
రామణీయక దిదృక్షుతయా సః
త్వద్గుణవ్రజ నిరూపణలోలః
సందధార నయనాని శ్రవాంసి.

13) వేణికాదర్శన శ్రద్ధః భుజంగ ఇతి భావయన్
తస్యపత్నీ రుజం భిన్నాం స్వయం యో భుజగోబభౌ.

14) చక్షుష్యసహమానే తే తన్వ్యాతామచ్యుతం శివమ్
గుణాధిక్యేన మృదునీ చాద్వైతాద్వైతతో మిథః

15) తవసురుచిరవక్త్రే చంద్రతానావభిన్నా
నయనమరుణితాయాః లక్ష్యమాస్తే భవత్యాః
లససి శుచితయానో కిం సమస్తప్రతీకైః
న భవసి యది చిత్రం మత్తమస్కాండభేత్త్రీ.

16) మదీయం ప్రారబ్ధం పరమమవరోద్ధుం నకృతినః
ఉపేక్షాం వోఢారః త్రిదివనిలయాః బాలకమిమమ్
మదజ్ఞానధ్వాంత స్ఫురదరుణభాః భామిని శివే
పురః కస్మాన్నస్యాః కిము వహంసి వత్స్యాయ లఘుతామ్.

17) నేత్ర యోరరుణ తాముపబిభ్రత్
కృష్ణతామపిచ కేశసమూహే
శ్వేతతాం నిరహతో వదనం స్యాత్
స్కందపూరుషసుకాంక్షి సుఖాయ

18) మల్లీకువలయజాతీ చంపకపంకేరుహాది గణయుక్తా
వల్లీ షణ్ముఖఘటితా చిత్రా దోధూయతాం హి దుఃఖాని.

19) శరజన్మని సహకారే వల్ల్యా పరివేష్టితే చ రూపం తత్
ఇహజన్మని చాశ్చర్యం దూరీకురుతే హ్యనంతపాపాని.

20) సజగ్ధిముపకల్పస్వ సపీతిమవభిన్నతామ్
షడ్భిర్మమతయాయుక్తైః సంస్కారఘటితైర్నరైః

21) లగ్నం కుమారే యచ్చేతః కట్యాం యస్యాం కుమారహ్యాత్
పాతు సా నిర్ణోదా సుకుమారకుమారగా

22) ఆరుణ్యలాలిత్యచణే కరాబ్జే
శ్రితౌ చ పాదావిహ భాగ్యభాజౌ
తే కల్పిషీరన్ స్ఫుటపద్మతామ్రాః
వాజీభచిహ్నాంఖిలు సంపదం నః

23) తన్వీమందగతీరక్తా శుద్ధా సద్గురుతాయుతా
భాగ్యరేఖేవ రాజన్తీ దేయాత్సుఖమనాకులా

24) స్తుత్యానయా ప్రసన్నాస్యాః స్ఫుటపంకజలోచనే
త్వదన్యన్నైవ జానీమః యదిచ్ఛసి కురుష్వతత్

## కుమారనుతిః

1) సుబ్రహ్మణ్యో జయతు నితరాం దేవసేనాసమేతః
వల్లీదేవ్యర్చితమృదుపదో వాసవాద్యర్చితో యః
బ్రహ్మాత్మజ్ఞో మునిగణనుతస్తారకధ్వాంతహర్తా
చిత్సాక్షీశః ప్రథితచరితః శ్రీవిదగ్ర్యోఽవతాన్నః.

(గ్రంథకర్త తండ్రిగారు)

## కుమారాష్టకమ్

రచయిత : శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యసన్యాసిశర్మ

1) షడ్వక్త్రమీడ్యం గిరిజాతనూజం మయూరవాహం మునివంద్యపాదమ్
శక్త్యాయుధం క్రౌంచవిభేదనం తం శ్రీమత్కుమారం
కలయామ్యహంతమ్.

2) స్కందం తమానందవనీసుకందం కోటీందువిభ్రాజదమందకాంతిమ్
భక్తార్తిదూరీకరణేఽనుషక్తం శ్రీమత్కుమారం కలయామ్యహం
తమ్.

3) త్వామిష్టదేవం స్మరతాం జనానాం వంశాభివృద్ధిం ధనధాన్యసిద్ధిమ్
దాస్యస్యహో తే కరుణాతిపూర్ణా శ్రీమత్కుమారం
కలయామ్యహంతమ్.

4) షష్ఠ్యాం భవన్తం పరిపూజయేద్యో నిష్ఠావిశేషేణ సునిగ్రహేణ
తస్మైశ్రియం దాస్యసి నిర్మలస్త్వం శ్రీమత్కుమారం కలయే హృదన్తః

5) విజ్ఞానదాతారమతీవ పూజ్యం సేనాన్యమిష్టం నను తారకారిమ్
భాసాస్వయా భా న్తమహో౽తిశా న్తం శ్రీమత్కుమారం కలయే
సదా౽హమ్.

6) వేదా న్తసిద్ధా న్తమఖండరూపమ్ సర్వాంతరత్వేన విరాజమానమ్
దేవం కృపావారినిధిం ప్రపూర్ణం శ్రీమత్కుమారం కలయేసదాహమ్.

7) శ్రీద్వాదశాక్షం భువనై కవంద్యం వల్లీమనోనాయకమీశపుత్రమ్
సంతానసౌభాగ్యఫలప్రదం తం శ్రీమత్కుమారం కలయేసదా౽హమ్.

8) శ్రీనిష్ఠలాభిఖ్యసువంశ సుబ్రహ్మణ్యేన సన్యాసిసుశర్మణేదమ్
గృహ్ణా న్త మేతత్కృతమష్టకం వై శ్రీమత్కుమారం కలయే సదాంతః

## సుబ్రహ్మణ్య మహిమ

గణ్యంబుల్ దేవ నీవౌకథలతిమహిమంగాంచి భూలోకమందున్
శ్రేణ్యాకారంబునొందున్ క్షితినొకస్థలముంజేరి రక్షింపుమంచున్
వాణ్యర్థోరాశి పుత్ర్యంబలపతులుగడుం ప్రార్థనల్ సేయ సుబ్ర
హ్మణ్యేశుండీ జగమ్మున్ మనిచెడు భరమున్ మస్తకమ్మందు దాల్చెన్[1]

## షడాస్యదండకమ్

రచయితా : శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యసన్యాసిశర్మా

శ్రీమత్షడాస్యామరేంద్రాదిభిః పూజ్యపాదాబ్జ వల్లీతనూవల్లరీ వేష్టితోమాసు తాంత - శ్చి ద్ధాత్మన్ సదాత్మన్ దివౌకోగ్రణీర్దేవసేనాన్యభిఖ్యాత భ క్తేష్ట దాయిన్ కుమార క్షమాపుత్ర గాంగేయ వహ్న్యాత్మజ స్కంద శీతాంశుకోటి ప్రభాభాసమానేశ పుత్రప్రభో భాష్యక ర్తః పరం బ్రహ్మనిష్ఠాం సమాప్నోషి బర్హీంద్రవాహః పరాత్మా గుహః కుండలీ కుండలిన్యం తరాభాసి చిజ్జ్యోతి రానందరూపో౽మలః కుంభసంభూతినారాధితః కాశికాత త్త్వమత్యంత గూఢం పురాబోధయస్త్వేవదేవప్రభో సర్వభూ హృద్గుహామాశ్రితో౽తోగుహాఖ్యాప్రసిద్ధా స్తి పూర్వం వనా త్త్వం శరాణాం జనిం ప్రాప్తవాంస్తారకారిస్సముక్తో మహాత్మన్ శుభో ద్వాదశాక్షః ప్రసిద్ధో మహాదేవపుత్ర ప్రభో పార్వతీ మాతృదేవీ మహేశః పితా సోదరో విఘ్ననాథః త్వదీయాస్సుభక్తాస్సదా సాన్వయస్స్యుః సువంశాభి

---

1) శ్రీ పిశుపాటి చిదందరశాస్త్రిగారి పద్యము

వృద్ధ్యాసుఖారోగ్యసిద్ధ్యాజరామృత్యుహీనాఃపరాత్మైక్యసిద్ధ్యాయుతాఃపూర్ణరూపా భవన్త్యేవపూర్వం సతీ దక్షరోషాచ్చిదగ్నౌ లయం ప్రాప్య శీతాచలాన్మేనకా గర్భ శక్త్యా పునర్జాయమానా నగాధీశపుత్రీ హ్యుమాపర్ణతాం ప్రాప్య నిత్యం శివం ధ్యాన యోగేన లబ్ధుం యతన్తీ స్థితాత్రాన్తరే తారకాఖ్యోఽసురోఽత్యన్తముగ్రం తపశ్చర్యయారాధ్య పద్మాసనం తం వరం లబ్ధవానీశపుత్రాద్వినా నైవ మృత్యుర్భవేదన్యతశ్చేతి తస్మాదహన్తాయుతో మన్యమానోఽస్త్యహన్తేతి హన్తా జగత్యా బభూవైష తన్నిగ్రహార్థం త్వదీయోఽవతారోఽభవద్దే వదే వైశ్చిరం ప్రార్థితశ్శైలరాజస్స్వపుత్రీముమాం పార్వతీమీశ్వరా యార్పయా మాస తస్మాత్పరం సామరస్యాత్త యోగేఽగ్నినా విఘ్న ఆరాధితే స్కన్న మీశస్యతేజః తతస్స్కందనామాసి పృథ్వ్యాభృతో భూమిపుత్రోఽసి వహ్ని గృహీతోఽగ్ని భూరాఖ్యయా భాసి గంగోదరే భాసమానశ్చ గాంగేయనామాసి తస్మాద్వనే త్వం శరాణాం జనిం ప్రాప్య తజ్జన్మనామాసి షట్కృత్తికాభిః ప్రదత్తం పయస్త్వం పిబన్ కార్తికేయోఽసి షాణ్మాతురష్షణ్ముఖస్త్వం సదా భక్తసంఘైః ప్రపూజ్యో విభాసీష్టదశ్శక్తిధారీ స్మృతః క్రౌంచభేత్తా త్వదీయం యతో జన్మ త్వన్మార్గశీర్షాద్యషష్ఠ్యాం శుభే కృత్తికాభే చ జన్మోత్సవం భక్తసంఘాః ప్రకుర్వన్తి తస్మాత్పరం దేవసేనాగ్రణీస్తారకం యుద్ధరంగేఽవధీర్లోక శాంతిం చకారైష దివ్యోఽవతారో నృణామైహికాముష్మికం కర్తుమిష్టే శుభాం జ్ఞాన సిద్ధిం విధాయాత్రముక్తిం కరిష్యత్యతః సర్వలోకైస్సదా పూజనీయోఽసి మన్తవ్యరూపోఽసి శుద్ధాత్మరూపస్త్వముక్తః షడాస్యేదముక్తం సదేష్టం హి వంశస్య చైవం పరాత్మా త్వముక్తోసి దేవప్రభో నిష్ఠలాభిఖ్యవంశే శుభే జన్మినా సింహశైలేంద్ర పుత్రేణ సన్యాసిశర్మాఖ్యయా షణ్ముఖాభిఖ్యయా భాసమానేన గీర్వాణవాణీబుధేంద్రేణ సత్కావ్య నిర్మాణదక్షేణ సర్వం వచో నైపుణం రాజరాజేశ్వరీ సత్కృపాలబ్ధమేషానుతిః తుభ్యమేవార్ప్యతే సర్వ కామప్రదా స్యాత్సువంశోదయస్యోద్దరిద్రత్వ బాధాభవేన్నైవ సమ్పత్తి రాయుష్యమారోగ్యలాభో భవేత్సర్వదా భక్తసంఘస్య చైవం వరం దేహి శ్రీ షణ్ముఖోమాసుతేశేతి సంప్రార్థయే పాహి దీనం దయాళో సదా పాహి తుభ్యం నమోదేవ తుభ్యం నమోదేవ తుభ్యం నమోదేవ తుభ్యం నమః

ఇంకా 'శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యసన్యాసిశర్మగారిచే రచింపబడిన షడాస్యశతకమ్' 1960 April June ఆరాధన పత్రికలలో ముద్రితమైనది.

కుమారభారతి కావ్యంలో ఇంద్రుడు కుమారస్వామిని యిలా కీర్తించాడు—

"జయజయ రత్నసుసంగతకంకణ! స్వర్ణకిరీట ధృషత్ప్రసరా!
జయజయ కుండల సంఘటితారుణ సాంధ్యకటస్థల చారుతరా!
జయజయ స్వర్ణవిశాల నగేశ్వరశక్తి విదారిత శత్రువరా!
జయజయహే ఋతశాసన కారణజన్మజగద్ధిత శాంతికరా!

# నాగేంద్రుని పాటలు

## సుబ్రహ్మణ్యస్తుతి

ఉమామహేశ్వర - కుమారగురవే - ఉడిపి సుబ్రహ్మణ్యం
హర - భక్తజనప్రియ - పంకజలోచన - బాలసుబ్రహ్మణ్యం ॥ఉమా॥
పతితపావన - పార్వతినందన - బాలసుబ్రహ్మణ్యం ॥ఉమా॥

సుబ్రహ్మణ్యం - సుబ్రహ్మణ్యం - షణ్ముఖనాథా - సుబ్రహ్మణ్యం
షణ్ముఖనాథా ,, స్వామినాథా ,,
పళనిమలేశా ,, ప్రణవస్వరూపా ,,
స్వామిమలేశా ,, మణదుమలేశా ,,
తిరుత్తణి ,, తిరుచందూరు ,,
శరవణభవగుహ ,, శివగిరియీశ్వర ,,
శూలాయుధా ,, వేలాయుధా ,, ॥సుబ్ర॥

ఓంగురునాథా సద్గురునాథా ,, ,,
హరిహర ,, శివ శివ శివ శివ ,, ॥సుబ్ర॥

సుబ్రహ్మణ్య మాంపాహి షణ్ముఖనాథా మాంపాహి
షణ్ముఖనాథా ,, స్వామినాథా - మాంపాహి ॥సుబ్ర॥

## నాగన్నపై పాట

దిగు దిగు దిగు నాగా నాగన్న - దివ్యసుందరనాగో నాగన్న

1. ఇల్లలికిముగ్గుపెట్టి - నాగన్నా - ఇంటాముల్లెలు చల్లి నాగన్న
మల్లెలవాసనతో నాగన్న - కోలాటమాడిపోరా ॥దిగు॥

2. అటుకొండ యిటుకొండ నాగన్నా - నడుమనాగులకొండ నాగన్న
కొండపైనున్నావా! నాగన్న - కోడెనాగువై ఓ నాగన్న ॥దిగు॥

3. భామలంతాకలసి! నాగన్నా - బావినీళ్లకెళితే నాగన్న
భావిలోఉన్నావా! నాగన్నా - బాలనాగువై ఓనాగన్నా ॥దిగు॥

4. పిల్లలంతాగూడి! నాగన్నా - పుల్లరేరబోతే నాగన్నా
పుల్లలలోఉన్నావా! నాగన్నా - పూలనాగువై ఓ నాగన్నా ॥దిగు॥

5. అయ్యప్పలంతకలసి! నాగన్నా - కోటప్పకొండకెళితే నాగన్నా
కొండపైఉన్నావా! నాగన్నా - కోడెనాగువై ఓ ॥దిగు॥

6. నడుముకుఉన్నాయి! నాగన్నా - నల్లానిమచ్చలాయే నాగన్నా
మచ్చమచ్చసందునా! నాగన్నా - మహిమలు ఉన్నాయి....
నాగన్నా ॥దిగు॥

7. ఊరికిఉత్తరాన! నాగన్నా - ఊడలమఱ్ఱిక్రింద నాగన్నా
మల్లెలవాసనలతో నాగన్నా - కోలాటమాడిపోరా! నాగన్నా ॥దిగు॥

8. శిరసునఉన్నాయి! నాగన్నా - శ్రీరామపాదాలు నాగన్నా

9. పూలుకుంకుమలుతెచ్చి! నాగన్నా - నీపుట్టపైచల్లి నాగన్నా
పాలుపండ్లుతెచ్చి! నాగన్నా - నీపుట్టలోపోసి నాగన్నా ॥దిగు॥

## కుమార స్తవమ్

"బాణప్రాభవమొప్పభార్గవునిపై పందెంబుగాఁ గ్రౌంచమున్
తూణంబొక్కటఁ దూటుగాఁబొడిచి నీదోర్వీర్యముంజూపగా
స్థాణుండంది ముదంబు తారకుని వక్షంబట్టులౌనంచు శ
ర్వాణింజేరివచించెశక్తిధర! త్వత్ప్రాగల్భ్య మూహింపుచున్"

—కుమార స్తవము శ్రీ అక్కిరాజు వేంకటేశ్వరశర్మ

## నాగులచవితి పాట

నీపుట్టదరికి నాపాపలొచ్చేరు
పాపపుణ్యములు వాసనేలేని
బ్రహ్మస్వరూపులౌ పసికూనలోయి!
కోపించి బుస్సలు కొట్టబోకోయి!

నాగులచవితికి నాగేంద్ర! నీకు
పొట్టనిండాపాలు పోసేము తండ్రి!

చీకటిలోన నీశిరసుతొక్కేము
కసిదీరమమ్మల్ని కాటెయబోకు
కోనపుట్టలోన కోడెనాగన్న
పగలుసాధించి మాప్రాణాలు దీకు.

నాగులచవితికి నాగేంద్ర! నీకు
పొట్టనిండాపాలు పోసేము తండ్రి!

అర్ధరాత్రివేళ అపరాత్రివేళ
పాపమేయెరుగని పసులుదిరిగేని
ధరణికి జీవనాధారమైనట్టి
వాటిని రోషాన కాటేయబోకు!

నాగులచవితికి నాగేంద్ర! నీకు
పొట్టనిండాపాలు పోసేము తండ్రి!

అటుకొండయిటుకొండ ఆ రెంటినడుమ
నాగులకొండలో నాట్యమాడేటి
దివ్యసుందరనాగ! దేహియన్నాము
కని పెట్టి మమ్మెపుడు కాపాడవోయి!

నాగులచవితికి నాగేంద్ర! నీకు
పొట్టనిండా పాలుపోసేము తండ్రి!

పగలనకరేయనక పనిపాటలంచు
మునిగితేలేటి నామోహాలభరిణె
కంచెలు కంపలు గడిచేటివేళ
కంపచాటునఉండి కొంపదీకోయి!

నాగులచవితికి నాగేంద్ర! నీకు
పొట్టనిండా పాలుపోసేము తండ్రి!

—కీ॥ శే॥ బసవరాజు అప్పారావుగారి గేయము

# ఉపయుక్త గ్రంథముల సూచిక
# (BIBLIOGRAPHY)


| వ.నెం. | పుస్తకము | రచయిత | ప్రకాశకులు | సంవత్సరము |
|---|---|---|---|---|
| 1. | ఆంధ్రులచరిత్ర-సంస్కృతి | వేదాల | వి.జి.యస్. పబ్లిషర్స్, అమలాపురము | |
| 2. | ఆంధ్రపత్రిక పంచాంగము | — | — | 1987 |
| 3. | ఆరాధన పత్రికలు | — | దేవాదాయధర్మాదాయ శాఖ, హైద్రాబాద్ | 1958, 1962, 1968 |
| 4. | ఆశ్వలాయన గృహ్యసూత్రము | ఆశ్వలాయనుడు | ఆర్యానందముద్రాక్షర శాల, బందరు | 1937 |
| 5. | ఈనాడు(దినపత్రిక) | — | — | 23-9-96,8-10-96 23-9-96,15-5-97 |
| 6. | ఐతరేయబ్రాహ్మణమ్ | — | V.N.Jubli Press, Madras | 1888 |
| 7. | కదళీపురక్షేత్ర మాహాత్మ్యము | — | కళ్లేపల్లి దేవస్థానము | — |
| 8. | కాలామృతమ్ | కాళిదాసు | విబుధమనోహారిణీ ముద్రాక్షరశాల చెన్నపట్నం | 1880 |
| 9. | గేయములు | శ్రీ బసవరాజు అప్పారావు | | |
| 10. | కుమారతన్త్రను | ఎడిటర్ ఇ.యమ్. కందస్వామిశర్మ | South Indian Archaka Association Madras | 1974 |
| 11. | కుమారసంభవమ్ | కాళిదాసు | వావిళ్ల ప్రెస్, మద్రాసు | 1941 |

| వ.నెం | పుస్తకము | రచయిత | ప్రకాశకులు | సంవత్సరము |
|---|---|---|---|---|
| 12. | కృష్ణసర్పవ్యాసము (స్వాతి) | శ్రీధరశ్రీరామ కృష్ణ | అనిల్‌బిల్డింగ్స్, విజయవాడ | 1-11-96 |
| 13. | ఖగేశ్వరసంహిత (సప్తగిరి) | | T.T.D. Tirupathi | Oct 1992 |
| 14. | గుప్తవాస్తు | దోగుపర్తిస్వామి గుప్తసిద్ధాన్తి | శ్రీవెంకటేశ్వర పబ్లికేషన్స్, గుంటూరు | 1979 |
| 15. | గుంటూరుమండల దేవాలయ,ధర్మాదాయ దర్శనము | — | దేవాదాయధర్మాదాయ శాఖ, గుంటూరు | 1979 |
| 16. | గౌరాంగ (మాస పత్రిక) | — | గౌడీయమఠము- గుంటూరు | Jan 1993 |
| 17. | చిత్రమీమాంసా | శ్రీ అప్పయ్య దీక్షితులు | చౌఖాంబాప్రెస్, వారణాసీ | 1971 |
| 18. | చైతన్యనందనమ్ | నిష్ఠల సుబ్రహ్మణ్యం | హిందీప్రెస్, తాడికొండ | 1987 |
| 19. | ధర్మసింధువు | కామేశ్వరశాస్త్రి | వావిళ్లప్రెస్, మద్రాసు | 1954 |
| 20. | నవగ్రహస్తుతిః | నిష్ఠల సుబ్రహ్మణ్యం | జూపిటర్‌ప్రెస్, గుంటూరు | 1982 |
| 21. | నవగ్రహస్తోత్రములు | | సాయి పబ్లికేషన్స్, గుంటూరు | — |
| 22. | నాగదేవత(వ్యాసము) (సప్తగిరి) | చంద్రశేఖర్ | T.T.Devasthanams, Tirupati | Aug 1988 |
| 23. | నాగపూజ | M. సత్యనారాయణ సిద్ధాన్తి | జనప్రియపబ్లికేషన్స్, తెనాలి | Jan 1992 |
| 24 | నాగప్రతిష్ఠాకల్పము | చల్లా లక్ష్మీ నృసింహశాస్త్రి | ఆర్యానందముద్రాక్షర శాల, బందరు | 1983 |
| 25. A | నాగానన్దమ్ | హర్షవర్ధనుడు | వావిళ్లప్రెస్, మద్రాసు | 1961 |

| వ.నెం. | పుస్తకము | రచయిత | ప్రకాశకులు | సంవత్సరము |
|---|---|---|---|---|
| 25.B | నాగారాధన-సప్తగిరి | లింగాభట్ల మార్కండేయశర్మ | T.T.Devasthanams, Tirupati | Nov1991 |
| 26. | నాగులచవితిపాట | బసవరాజుఅప్పారావు గారు | బసవరాజు అప్పారావు ట్రస్ట్, పున్నమ్మతోట, విజయవాడ | 1991 |
| 27. | పద్మపురాణమ్ Vol-3 | శ్రీవేదవ్యాసః | ఆనందాశ్రమప్రెస్, పూనా | 1894 |
| 28. | పారిజాతాపహరణము | నందితిమ్మన | M. శేషాచలం & కో, వెంకటేశ్వరప్రింటర్స్ | 1970 |
| 29. | పురాణోక్తకర్మ ప్రకాశిక | — | ఆర్యానందముద్రాక్షరశాల బందరు | — |
| 30. | పూర్వగాథాలహరి | శ్రీవేమూరి శ్రీనివాస రావు | Venkatrama & co, Hybd | 1986 |
| 31. | బ్రహ్మవైవర్త పురాణమ్ (సం) | శ్రీవేదవ్యాసః | Venkateswarapress, Bombay | 1853(శ) |
| 32. | బ్రహ్మాండపురాణమ్ | ,, | ,, | 1857 (శ) |
| 33. | భారతి | — | ఆంధ్రపత్రికప్రెస్ | Oct 1980 |
| 34. | దాసుశ్రీ రాములుగారి కృతులు - సమీక్ష | వెలగపూడి వైదేహి | దాసుశ్రీరాములు స్మారకసమితి విజయవాడ | 1986 |
| 35. | మహాభారతమ్ | శ్రీవేదవ్యాసః | స్వాధ్యాయమండల్, బల్సాడ్ | |
| 36. | మేఘసందేశము | కాళిదాసు | వావిళ్లప్రెస్, మద్రాసు | 1940 |
| 37. | రఘువంశము | ,, | నిర్ణయసాగర్ప్రెస్,భాంబే | 1948 |
| 38. | వనితాజ్యోతి(పత్రిక) (వ్యాసము) | గుంపత్రిజగదీశ్వరి | | Aug 1996 |

| వ.నెం. | పుస్తకము | రచయిత | ప్రకాశకులు | సంవత్సరము |
|---|---|---|---|---|
| 39. | వరాహపురాణమ్ | శ్రీవేదవ్యాసః | Kshemaraj Srikrishna Das, Venkateswara press, Bombay | 1980 |
| 40. | వామనపురాణమ్ | ,, | ,, | 1851 (శ) |
| 41. | వాస్తుయన్త్రరత్నావళి | M. సత్యనారాయణ సిద్ధాన్తి | జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి | Feb 1991 |
| 42. | వాస్తువిద్యామహోదధి | పోతుకూచి వెంకటేశ్వర శాస్త్రి | భారతీప్రెస్-తెనాలి | 1960 |
| 43. | శిరివరపువారిషష్టిపూర్తి సంచిక | | రాజ్యం ప్రింటింగ్ప్రెస్ సత్తెనపల్లి | |
| 44. | శివసంహితా | — | బడాగణేశ్, వారాణసీ | 1977 |
| 45. | శ్రీకాళహస్తిమాహాత్మ్యము | ధూర్జటి | శేషాచలం & కో, | 1990 |
| 46. | శ్రీదత్తమహిమ | శ్రీమిన్నికంటిగురునాథ శర్మ | సీతమ్మ, సూర్యనారాయణ, యుగంధర లక్ష్మి, గుంటూరు | |
| 47. | శ్రీదుర్గాసప్తశతీ | — | శ్రీబాలావిద్యామహాపీఠము, లక్కవరం | 1987 |
| 48. | శ్రీమదాంధ్రమహాభారతము (ఆది పర్వము) | నన్నయ | వావిళ్లప్రెస్, మద్రాసు | 1935 |
| 48. A | ,, | ,, | ఆంధ్రగ్రంథమండలి, తెనాలి | 1930 |
| 49. | శ్రీమద్భగవద్గీతా | వేదవ్యాసః | | |
| 50. | శ్రీమద్వాల్మీకిరామాయణము | శ్రీవాల్మీకి | గీతాప్రెస్, గోరఖ్ పూర్ | (2020వి) |

| వ.నెం. | పుస్తకము | రచయిత | ప్రకాశకులు | సంవత్సరము |
|---|---|---|---|---|
| 51. | శ్రీమన్మహాభారతమ్ (సం) | వ్యాసః | స్వాధ్యాయమండల్, పారడీ, బల్సాహ్ | 1968 |
| 52. | శ్రీసుబ్రహ్మణ్యసహస్ర నామస్తోత్రము | ,, | సాయి పబ్లిషర్స్, గుంటూరు | |
| 53. | షణ్ముఖదండకమ్ (ఆరాధన) | నిష్ఠలసుబ్రహణ్య సన్యాసిశర్మా | దేవాదాయధర్మాదాయ శాఖ, హైద్రాబాద్ | Jan 1960 |
| 54. | సహ్యాద్రిఖండః | శ్రీవేదవ్యాసః | | |
| 55. | సాముద్రికశాస్త్రమ్ | ప్రహ్లాదుడు | Vavilla press, Madras | 1950 |
| 56. | సాలగ్రామశాస్త్రమ్ | కపిలవాయి లింగ మూర్తి | Padmavathi Art printers, Hybd | 1984 |
| 57. | సిద్ధివినాయకవ్రత కల్పము | — | బుధపలుకుంజెలి జ్యోతిషాలయము పురిణినరసింహా రెడ్డి & సన్స్, ఒంగోలు | 1985 |
| 58. | సుబ్రహ్మణ్యేశ్వరీయము | పిఠపాటి చిదంబరశాస్త్రి | సుజనరంజనీముద్రాక్షర శాల, కాకినాడ | 1913 |
| 59. | సౌమనస్యమ్ (ప్ర.భా) | నిష్ఠల సుబ్రహ్మణ్య సన్న్యాసిశర్మ | అజంతా ప్రింటర్స్, సికింద్రాబాద్ | |
| 60. | సౌమనస్యమ్ (తృ.భా) | ,, | ,, | |
| 61. | స్కాందపురాణమ్ (మహేశ్వరఖండః) | వ్యాసః | మన్సుఖ్రాయ్, క్లైవ్రోడ్, కలకత్తా-5 | 1965 |
| 62. | స్కాం.పు(వై.ఖం) | ,, | ,, | 1960 |
| 63. | స్కాం.పు.(బ్ర.ఖం) | ,, | ,, | 1961 |
| 64. | స్కాం.పు.(కాశీఖండం) | ,, | ,, | 1961 |

| వ.నెం. | పుస్తకము | రచయిత | ప్రకాశకులు | సంవత్సరము |
|---|---|---|---|---|
| 65. | స్తుతిమణిమాలా | శ్రీశంకరశాస్త్రి | వాణీవిలాస్ప్రెస్, శ్రీరంగము | 1953 |
| 66. | స్వప్నప్రకాశికా | దత్తరాముడు | వావిళ్లరామస్వామి & సన్స్, మద్రాసు | 1950 |

ENGLISH

| | | | | |
|---|---|---|---|---|
| 67. | Kalasarpayoga (Jatakam-magazine) | Prof. P.S.Sastry | 3-5-208, Vittalavadi Narayanaguda, Hyderabad | |
| 68. | Rahu the planet of Materialism | Depin Behari | | Nov 1972 |
| 69. | Sankaras Shanmata (Astrological magazine) | — | Conference commitee, Madrsas | 1969 |
| 70. | Wonder world Magzine | — | Sudha publications Vijayawada | June 93 Mar 96 |